17.3.95 శుక్రవారం 16 పేజీలు, సంపుటి: 67., సంచిక: 11, విడిప్రతి: రు. 2.00 లు

Phone : 27354

Regd No. HNL. 18.

# జమీన్ రైతు



స్థాపకులు : నెల్లూరు వెంకట్రామానాయుడు [illegible] : నెల్లూరు శ్రీరామమూర్తి

# ఎన్టీఆర్ బిత్తరపోయారు!

మండల, జిల్లా ప్రజా పరిషత్ ఎన్నికలలో రాష్ట్ర మంతటా కాంగ్రెస్ పార్టీ అనూహ్య విజయం సాధించడం తెలుగుదేశం నాయకులను కలవర పెడుతున్నది. వారి పరిణామాన్ని వూహించనైనా లేదు. మూడు నెలల

పోయిందన్న ధైర్యంతో వుండినారు. ఎన్టీఆర్ అయితే కాంగ్రెస్ పెట్ అని, అది కూడా ఒక పార్టీయా అని అవహేళన చేశారు. ప్రతిపక్షం అర్హత సైతం సంపాదించలేని తీరులో ప్రజా తిరస్కారానికి గురైన పార్టీ అని ఎత్తి

**మూడు నెలల్లో జనం మనసు మార్చుకోవడం ఎందుకో అర్థంకాక తెలుగుదేశం నాయకులు తత్తరపడి పోతున్నారు. జాతీయ రాజకీయాల్లో తమ పాత్ర పై పునరాలోచిస్తున్నారు!**

క్రితం జరిగిన శాసన సభ ఎన్నికలలో కాంగ్రెస్ ఓటమి తీరును చూసిన నాయకులు, ఎన్టీఆర్తో సహా ఆ పార్టీ నామ రూపాలు లేకుండా తుడిచి పెట్టుక

పొడిచారు. రాష్ట్రంలో శాశ్వతంగా తాము మాత్రమే అధికారంలో వుంటామన్న భరోసా ఎన్టీఆర్లో కన్పించింది. అందువల్లే ఆయన రాష్ట్ర రాజకీయాలను

ప్రక్కన బెట్టి, జాతీయ స్థాయికి ఎదగాలని ఆశపడ్డారు. ప్రధాని కుర్చీ మీద కూర్చున్నట్లే కలలు కన్నారు. మహారాష్ట్రలో కాంగ్రెస్ ఓటమి ఆయన్ను మరీ ఉత్సాహ పరచింది. ఈ నేపథ్యంలో ఉన్నట్లుండి ప్రజలు కాంగ్రెస్ పార్టీకి ఓట్లేయడంతో ఎన్టీఆర్ బిత్తర పోయారు. ఎన్నికల ఫలితం వెలువడిన 13,985 మండల నియోజక వర్గాలలో కాంగ్రెస్ 4938 స్థానాలు గెల్చుకున్నది. ఇది 35 శాతంతో సమానం. తెలుగుదేశానికి అత్యధికంగా 7144 స్థానాలు లభించినప్పటికీ, వాటిలో వచ్చిన మెజారిటీలు స్వల్పమే! జిల్లా పరిషత్ నియోజక వర్గాలకు సంబంధించి 1035 స్థానాల ఫలితాలు ప్రకటిస్తే కాంగ్రెస్ 275 స్థానాలు గెల్చుకున్నది. నిజామాబాద్లో కాంగ్రెస్కు స్పష్టమైన

ఆధిక్యత లభించి ఆ జిల్లాప ఛైర్మన్ పదవి స్వంతం చేసుకున్నారు. కరీంనగర్లో ఇద్దరు స్వతంత్రులను

లేదా ముగ్గురున్న బిజెపిని కలుపుకుంటె కాంగ్రెస్ ఛైర్మన్ కుర్చీలో కూర్చో

(కొరవ 9 పేజీలో)



# బడ్జెట్ వల్ల అత్యధికంగా నష్టపోయింది రిలయన్స్ కంపెనీయే!

బడ్జెట్ వల్ల కార్పొరేట్ రంగం పై పెద్దగా చెప్పుకో దగిన ప్రభావాలేమీ పడటం లేదు. దీనివల్ల సాధారణ ఇన్వెస్టర్‌కి నష్టం లేదు, లాభమూ లేదు. బడ్జెట్‌లో ప్రభావితమయ్యే కంపెనీల షేర్ల వివరాలు చర్చించు కుందాము.

బడ్జెట్‌లో తగ్గించిన దిగుమతి సుంకాల వల్ల ప్రధానంగా నష్టపోయే భారతీయ పరిశ్రమ-రిలయన్స్ ఇండస్ట్రీస్ అనే చెప్పాలి. వారు తయారు చేసే పిటిఎ అనే ఒక పాలిస్టర్ దారపు పదార్థంపై కస్టమ్స్ పన్ను తగ్గించినందువల్ల, భారతదేశంలో వీరు విక్రయించే ధర కంటే తక్కువగా విదేశాల నుంచి అదే పదార్థాన్ని దిగుమతి చేసుకోవచ్చు. దీనివల్ల రిలయన్స్ కంపెనీ చాలా నష్టపోతుంది.

అయితే అదే రకం పదార్థంతో ఇతర వస్తువుల తయారీలో వున్న డిసిపిఎల్ పాలిస్టర్, సాంఘి పాలిస్టర్ కంపెనీలు మాత్రం లాభపడతాయి. వారు ఇప్పుడు నష్టాలు ఎదుర్కొంటున్నారు. అవి చాలా వరకు పూడి పోతాయి.

## సత్యం కంప్యూటర్స్‌కు మంచి ప్రయోజనం!

సాఫ్ట్‌వేర్ తయారీలో వున్న హైదరాబాదులోని సత్యం కంప్యూటర్ కంపెనీ బడ్జెట్ వల్ల బాగా లాభపడబోతున్నది. అమెరికాలో ప్రసిద్ధమైన, క్లయింట్స్ అనదగిన కాటరపిల్లర్, డీరీ అండ్ కంపెనీ, స్టేట్ ఫారం ఇన్స్యూరెన్స్ వంటి సంస్థలు సత్యం కంప్యూటర్స్‌కు క్లయింట్లుగా వున్నారు. అమెరికాలో వీరు ఒక సంయుక్త ప్రాజెక్టును కూడా నిర్వహిస్తున్నారు. కంప్యూటర్ల దిగుమతి పై సుంకాన్ని 60 నుంచి 40 శాతానికి తగ్గించి నందువల్ల వీరికి ఎంతో ప్రయోజనం.

> డాక్టర్ దుర్గాప్రసాద్

సత్యం కంప్యూటర్స్ సెప్టెంబరు మాసాంతానికి 9.54 కోట్ల టర్నోవర్ పై 3.82 కోట్ల నికర లాభం ఆర్జించింది. మార్చి ఆఖరకు సేల్స్ 25 కోట్లకు, ఇపిఎస్ రూ. 5 లకు పెరిగే అవకాశం వుంది.

## హైతాయ్‌సన్ మాగ్నటిక్స్

అహమ్మదాబాద్‌లోని ఈ కంపెనీ షేరు ఇప్పుడు రూ. 45 లుగా వుంది. వీడియో క్యాసెట్ తయారీ వీరి వ్యాపారం. సంవత్సరానికి ఒక కోటి క్యాసెట్లు తయారు చేస్తారు. బడ్జెట్‌లో ట్యాక్స్‌ను 25 శాతానికి తగ్గించడం వల్ల వీరు అధికంగా లాభపడతారు. అందులోనూ సినిమా రంగంలో, టివి పరిశ్రమలో అధికంగా వినియోగించే 'యుమాటిక్' క్యాసెట్ల తయారీ ఇటీవలే ప్రారంభించి వున్నారు.

ఈ కంపెనీ ఈక్విటీ 12.5 కోట్లు; సెప్టంబరు ఆఖరుకు 18 కోట్ల వ్యాపారం చేసింది; 4.5 కోట్లు లాభమార్జించింది. ఇపిఎస రు 6 లు. కంపెనీ ఉత్పత్తులలో 85 శాతం ఎగుమతౌ తున్నాయి. పన్నుల తగ్గింపు వల్ల వీరి లాభాలు మరింత పెరుగుతాయి.

## జెసిటి ఎలక్ట్రానిక్స్ పంట పండింది!

జెసిటి ఎలక్ట్రానిక్స్ థాపర్ గ్రూపు కంపెనీ. 20, 21 అంగుళాల కలర్ పిక్చర్ ట్యూబ్‌లు తయారు చేస్తారు. ఈ సైజు కలర్ ట్యూబులు తయారు చేసే కంపెనీ దేశంలో ఇదొక్కటే! సెప్టెంబర్ ఆఖరకు 136 కోట్ల సేల్స్ టర్నోవర్ పైన 18 కోట్ల నికర లాభం ఆర్జించారు. మార్చి అంతానికి 6 లక్షల ట్యూబులు తయారు చేయాలన్న లక్ష్యంతో పనిచేస్తున్నారు. దీనివల్ల టర్నోవర్ 210 కోట్లకు, లాభం 37 కోట్లకు పెరిగే అవకాశం వుంది. జపాన్‌కు చెందిన హిటాచి కంపెనీకి

కొరవ 9 పేజీలో

# అంత ప్రీమియం సమర్థనీయమా?

మద్రాసులో 'మాగుంట' ఒబ్రాయ్ హోటల్ నిర్మిస్తున్న బాలాజీ హోటల్స్ అండ్ ఎంటర్ ప్రైజస్ ఈ నెలలో భారీ పబ్లిక్ ఇష్యూ విడుదల చేస్తున్నది. రు 10 ల షేరు రు 125 ల ప్రీమియంతో; రు 150 ల ప్రీమియంతో పూర్తి కన్వర్టిబిలిటీ వున్న డిబెంచర్లు విడుదల చేస్తున్నారు. ఇష్యూ ద్వారా పెట్టుబడి సేకరణ లక్ష్యం 111 కోట్లు.

మద్రాసులోని అబిడ్స్ బరిలో 5 స్టార్ సూపర్ డీలక్స్ హోటల్ నిర్మాణం ప్రథమ దశలో జరుగుతుంది. ఇందులో 333 గదులుంటాయి. కోయంబత్తూరు, మద్రాసు నగరాలలో రెండు ఫోర్ స్టార్ హోటళ్లు రెండవ దశలో నిర్మితమౌతాయి. మొత్తం పెట్టుబడి వ్యయం 223 కోట్ల 65 లక్షలు.

ఇవి కాక, మద్రాసులోని సత్యం, శివం, సుందరం థియేటర్లు పడగొట్టి, అక్కడున్న 50 గ్రౌండ్లకు పైబడిన స్థలంలో లక్షురీ ఫ్లాట్స్ నిర్మించి, వారం రోజుల బాడుగ పద్ధతి పై ఇవ్వాలన్న ఆలోచన వుంది. ఒక వారానికి ఒక్క ఫ్లాట్ బాడుగ రు. 700 లుగా నిర్ణయించారు. ఇండియాకు వచ్చి, నెల రెండు నెలలు వుండిపోయే ఎన్ఆర్ఐలను దృష్టిలో పెట్టుకొని ఈ నిర్మాణం తలపెడుతున్నారు. ఇటువంటి వారికి హోటళ్ల కంటె ఇది చవక అవుతుంది.

కంపెనీ లక్ష్యం, కార్యాచరణ ప్రణాళిక బాగానే వున్నాయి. కాని, షేరుకు నిర్ణయించిన ప్రీమియం సమర్థనీయమా అన్నది ప్రశ్న. భారతదేశంలో అత్యంత ఖరీదైన హోటల్

> బాలాజీ హోటల్స్ పబ్లిక్ ఇష్యూ

లీలా కెంపెన్స్కి; కంపెనీ బొంబాయిలోని వారి హోటల్ గది బాడుగ, పన్నులు లేకుండా ఒక రాత్రికి రు 6950లు; వీరి షేరు ధర రు 130 లుగా వుంది. ప్రఖ్యాతి చెందిన తాజ్‌గ్రూప్ ఆఫ్ హోటల్స్ షేరు ధర రు 600 లు; ఐటిసి హోటల్స్ షేరు ధర రు 300 లు; ఏసియన్ హోటల్స్ షేరు రు 200 లకు లభిస్తున్నాయి. హోటల్ పరిశ్రమలో ఇప్పటికే స్థిరపడి, లాభాలార్జిస్తున్న పెద్ద హోటల్స్ షేర్ల ధరలు ఆ రకంగా వున్నప్పుడు బాలాజీ హోటల్స్ షేరు రు 135 లు పెట్టి కొంటే గిట్టుబాటు అవుతుందా?

కొరవ 9 పేజీలో

# సారంలేని బడ్జెట్

జ

1995-96 సంవత్సరానికి ఆర్థిక మంత్రి డాక్టర్ మన్‌మోహన్ సింగ్ ప్రతిపాదించిన కేంద్ర బడ్జెట్ ఉత్సాహ, నిరుత్సాహాలు రెండింటినీ కల్గించడం లేదు. ఆర్థికాంశాల పరిగణన కంటే రాజకీయ అవసరాలు ప్రాధాన్యత సంతరించుకోవడం, మన్‌మోహన్ సింగ్ కూడా అందుకు తల ఒగ్గ వలసి రావడం బడ్జెట్‌లో స్పష్టంగా వ్యక్తమైంది. తన ఆర్థిక సంస్కరణల ద్వారా భారతదేశాన్ని ఆసియా ఖండంలో బలీయమైన ఆర్థిక శక్తిగా రూపొందించాలన్న ఆర్థిక మంత్రి ఆశయానికి ఈ బడ్జెట్ పెద్ద బ్రేక్ వేసింది. ఏడాది లోపల ఎన్నికలకు సిద్ధం కావలసిన తరుణంలో, శాసన సభకు ఎన్నికలు జరిగే ప్రతి ముఖ్యమైన రాష్ట్రంలోనూ కాంగ్రెస్ దారుణ ఓటమి చవిచూస్తున్న నేపథ్యంలో ప్రభుత్వ నిధులను ప్రచారకర్షక పథకాలకు మళ్లించక తప్పని పరిస్థితిని ఎదుర్కొంటున్నారు ఆర్థిక మంత్రి. సంస్కరణల పురోగతి దెబ్బ తినకుండా, పార్టీలోని విమర్శకులను సంతృప్తి పరచే, ఓటుకు గాలం వేసే పథకాలు అమలు పరచాలనే సంకల్పంతో పెద్ద సర్కస్ ఫీటే చేశారు మన్‌మోహన్ సింగ్! ఆ లక్ష్యంతోనే ఆయన స్కూలు పిల్లలకు మధ్యాహ్న భోజన పథకం, సబ్సిడీ పై పేదల కోసం నిర్మించే పక్కా ఇళ్ల సంఖ్యను 4 నుంచి 10 లక్షలకు పెంచడం, వృద్ధ నిరుపేదలకు పెన్షన్, పేదలకు ఇన్స్యూరెన్స్ పథకం వంటివి ప్రకటించారు. ఇవన్నీ జనాకర్షణ కోసమే చేసినా, అవి జనాన్ని ఎంత వరకు ఆకర్షిస్తాయి, ఓటర్లలో ఎంత మాత్రం మార్పు తెస్తాయి అన్నది సందేహమే. అయితే పేరుకు ఇన్ని పథకాలు ప్రకటించినా, గ్రామీణాభి వృద్ధికి ఇప్పటికే పెడుతున్న ఖర్చులో వాటిని ఇమడ్చడం తప్ప, చెప్పుకో దగిన నిధులేవీ అందుకు కేటాయించ లేదాయన. గ్రామీణాభి వృద్ధికి గత బడ్జెట్‌లో 7320 కోట్లు ఖర్చు పెడితే, ఇప్పుడు 7700 కోట్లు మాత్రమే కేటాయించారు. మధ్య తరగతి ఓటర్లను ఆకర్షించడానికి ఆదాయం పన్ను పరిమితిని 35 వేల నుంచి 40 వేలకు పెంచారు. ఇది ఆ వర్గాన్ని అంతగా సంతృప్తి పరచడం లేదు.

కార్పొరేట్ రంగమూ బడ్జెట్ పై అసంతృప్తితోనే వుంది. కార్పొరేట్ పన్నులను తగ్గించి, సర్ ఛార్జిని రద్దు చేయాలని కార్పొరేట్ రంగం కోరిన కోరికను తీర్చలేక పోయారు ఆర్థిక మంత్రి.

ఆర్థిక సంస్కరణల కొనసాగింపుకు చిహ్నంగా ఆయన దిగుమతి సుంకాన్ని 65 నుంచి 50 శాతానికి తగ్గించారు. కంప్యూటర్సు, మెషిన్ టూల్స్, ఇనుము, ఫిలమెంట్ దారం, వంట గ్యాసు, పేపరు ప్లాస్టిక్స్, అల్యూమినియం వంటి వస్తువుల పై దిగుమతి సుంకాన్ని తగ్గించారు. వీటన్నింటి ఫలితంగా 2390 కోట్ల వరకు ప్రజల పై పన్నుల భారం తగ్గుతుంది. సిగరెట్లు, టైర్ల పై తప్ప మరి దేనిపైనా కొత్త పన్నులు వేయలేదు. ప్రజలు ఒక రకంగా సంతోషించ వలసిన విషయమే ఇది.

అయితే ఆర్థిక వ్యవస్థ నిర్వహణలో అతిం చిన అదుపు వీలు కాలేదని ఈ బడ్జెట్ నిరూపించింది. ఫిస్కల్ లోటును జాతీయోత్పత్తిలో 6 శాతానికి పరిమితం చేయాలన్న లక్ష్యం విఫలమై 6.9 శాతానికి ఎగబ్రాకింది. రక్షణ వ్యయం, ఆహార, ఎరువుల సబ్సిడీలను నియంత్రించడమూ ఆర్థిక మంత్రికి అలివి కాలేదు.

అన్నిటి కంటే మించినది ద్రవ్యోల్బణ సమస్య. రెండంకెల స్థాయికి చేరుకున్న ఈ భూతాన్ని అదుపు చేయడం కోసం రానున్న ఏడాదిలో తాను చేపట్ట బోయే చర్యలేవీ ఆయన వివరించలేదు. దీనివల్ల మధ్య తరగతి ఉద్యోగ వర్గాలు అధికంగా నష్టపోతాయి. అభివృద్ధేతరంగా పెట్టే నాన్ ప్లాన్ వ్యయాన్ని ఒక పరిమితిలో నిలువరించడం లోనూ మన్‌మోహన్ సింగ్ విఫల మైనారు. మొత్తం లక్షా 67 వేలా 151 కోట్ల రాబడిలో, లక్షా 23 వేలా 651 కోట్లు - అంటే 74 శాతం ఆదాయం నాన్ ప్లాన్ ఖర్చుకే సరిపోతున్నది. ఇందులో వడ్డీలే 52 కోట్ల రూపాయలు తినేస్తున్నాయి. ఈ పరిస్థితులలో ఏ ఆర్థిక మంత్రి మాత్రం చేయగల్గేదేముంది!

మొత్తం మీద ఈసారి బడ్జెట్ అన్ని వర్గాలనూ నిరాశ పరచింది.

జమీన్‌రైతు

## జమీన్‌రైతు

15-3-1945

పేజీలు : 12 వెల : 0-1-6

### చిత్ర గుప్తుని పంచాంగం

#### పంచాంగ శ్రవణ ఫలం

శ్లో. స్త్రీ కళ్యాణము చేయడం,
వరుని కంతా అస్థి అర్పించడం,
అప్పుల్ నీటను మున్గడం
తేలడం, ఆకాస్త కొంపార్పడం,
ఈసాలెన్నికి లాగడం, పరువు
మర్యాదల్ గూడ పోగొట్టడం,
నానాభ్రష్టత ప్రాప్తదం,
ఆడబిడ్డల్‌గన్న తల్లిండ్రికీ,
ఏతల్కాల విషేపసం, సమహితం.
పంచాంగ మాకర్ణలా:

### నెల్లూరు ముచ్చట్లు

#### ఉగాది శుభసందేశం

కాలచేముతేగాడు పురో హితుడు గూడా చేదు వినిపిస్తున్న ఈ ఉగాది పర్వణి పుణ్యదినంనాడు మీకేమి హితకరమైన శుభ సందేశాన్ని వినిపిస్తామా అని ఆలోచనాసక్త అన్వేషిస్తున్న కాలంలో నిన్న సాయంత్రం జిల్లా కలెక్టరుగారు నెల్లూరు పౌరులకు హఠాత్తుగా ఒక కమ్మటి వార్త వినిపించారు. ఏమని?

"గత 3సంవత్సరాలుగా సాలుకు 50వేల రూపాయలు పౌరులు తలపై విరిగిపడు మునిసి ప్యూనిటీపటాక్సు ఏప్రెలు 1 తేదినుండి రద్దుచేయడమైంది".

అని వినిపించారు.

#### బ్రతికామురా దేముడా:

ఓ కలెక్టరో! నీకు దీర్ఘాయుష్మమస్తు. వంశాభి వృద్ధిరస్తు, పుత్ర పౌత్రాభి వృద్ధిరస్తు, సర్వేగ్రహశుభ ఏకాదశస్థాన సుప్రసన్న ఫలదా వరదా భవంతు.

#### రెండో శుభ సందేశం

ఈ సంవత్సరం 9 మంది నవగ్రహాలలో 8 మంది శుభగ్రహాలు లభ్యమైనవి. అంటే స్ట్రిక్టు, పబ్లికు యింటరెస్టు కోరే ఆఫీసర్లు లభ్యమైనారన్నమాట.

#### ఆ 8 గ్రహాలు.

1. జిల్లా కలెక్టరు.
2. పోలీసు సూపరెంటు
3. నెల్లూరు డిప్టి సు పరెంటు
4. నెల్లూరు సర్కిల్
5. D.C.T.O.(స్పెషల్)
6. జిల్లా డాక్టర్.
7. టెక్స్‌టైల్ ఆఫీసరు.
8. (8వ గ్రహం దొరకలేదు

#### 50 ఏళ్లక్రితం ఈవారం

ఈ 8 మంది శుభగ్రహాలయటంవల్ల ఐదుదు కులు లేకుండ జిల్లా పరిపాలన చక్కపడటం, పోలీసు శాఖలో లంచగొండితనం తగ్గడం, ప్రజల ధన మాన రక్షణాల్లో ఘనపంచేయుండడం, వ్యాపారాల్లో అధికలాభాల నాసించి ప్రజాక్షేమాన్ని భంగపరచకుండడం 'ధనాన్నిబట్టి మెడికల్ హెల్ప్' అనే పద్ధతి నశించడం, ఇత్యాది ఫలాలు యీ 8 గ్రహాల వల్ల లభ్యం కాగలవు.

కాబట్టి యీ రెండో శుభ సందేశం గూడా ఉగాది పుణ్యకాలంలో మీరు వినవలసిందే.

* * *

( తరు వ 10 వ పేజీలో )

# మెగాస్టార్ సినిమాలో మెగా బూతు!

ట

అశ్లీల చిత్రాల్లో నటించనని చెప్పే మెగాస్టార్ చిరంజీవి తాజా చిత్రం 'అల్లుడా మజాకా' అశ్లీలానికి పెద్ద పీట వేసింది. చిరంజీవి ఈ మెగా స్థాయి అశ్లీలాన్ని ఎట్లా ఒప్పుకున్నాడా అని ఆశ్చర్య పడేలా ఈ చిత్రంలో సన్నివేశాలు సాగిపోతాయి. హీరోయిన్లు రమ్యకృష్ణ, రంభలు స్కిలిస్మిత, డిస్కోశాంతిలను మరిపిస్తారు. హీరో అత్తను ఆవిడ ఇద్దరు కూతుళ్లను చాపచుట్టి, గుడ్డలు సైతం తొలగించి హీరో రంకెలు వేస్తాడు. చెరువులో స్విమ్మింగ్ డ్రస్‌లో స్నానం చేస్తున్న హీరోయిన్ల గుడ్డలు పీకివేయడం హీరో గారి కృష్ణలీలగా భావించాలేమో! సెన్సార్ వారు ఈ మధ్య విడుదలచేసిన మార్గదర్శక సూత్రాల్లో స్త్రీ బొడ్డును కావాలని చూపించ కూడదని స్పష్టంచేసి వుండగా ఈ చిత్రంలో ఓ సన్నివేశం ఈ ట్విస్టు మీదే నడుస్తుంది. నిర్మాత, దర్శకులు తమ చిత్రం విజయం కోసం ఎంత అశ్లీలాన్నయినా నింపుతారు. చిత్రం సెన్సారుకు వెళ్లి నప్పుడైనా వాటిని తొలగించ కుండా బోర్డు, దాని సభ్యులు ఏంచేస్తున్నట్లు? గతంలో చిరంజీవి చిత్రాల్లో రొమాన్సున్నా సిలెవల్లో సాగేది. కానీ ఈ చిత్రంలో మాత్రం ఆ విషయంలో పతనావస్థకి చేరు కొంది. చిత్రీకరణలో సాధ్యా అసాధ్యాల విషయం తీసేసి కావాలని అశ్లీలతని దృశ్యాల్లో, మాటల్లో జొప్పించి సామాజిక దృక్పథాన్ని నశింప జేశారు.

హైదారాబాద్. -ఎం. నరసింహారావు.

## కార్యకర్తలు సత్తా చూపారు!

ఈ మధ్య జరిగిన జిల్లా మండల పరిషత్తు ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ తరఫున నాయకులెవరూ పని చేయకపోయినా కార్యకర్తలు తమ సత్తా చూపారు. 530 మండల వార్డులకు గాను 215 లో విజయం సాధించి నాయకులకు తగిన బుద్ధి చెప్పారు. వెంకటగిరి, బుచ్చి, రాపూరు, అల్లూరు వంటి చోట్ల మాజీ శాసన సభ్యుల కృషికి తగిన ఫలితమే లభించింది. మొన్నటి వరకు అధికారంలో వున్న నాయకులు అది పోయాక కార్యకర్తలను పట్టించుకోవడం మానేశారు. ఇకనైనా నాయకులు తమ ధోరణిని మార్చుకోవాలి. గ్రామాల్లో సమస్యల పట్ల స్పందించి పనిచేయాలి. కార్యకర్తలకు అండగా నిలబడి పంచాయితీ ఎన్నికల్లో విజయభేరి మ్రోగించాలి.

కలిచేడు. -ఎన్. మహబూబ్‌బాష.

## జనవాణి

### గెలిచే వాడికే టిక్కెట్ ఇవ్వాలి!

విజయవాడ నగర కార్పొరేషన్ ఎన్నికల టి ఫారాల తంతు నాటకీయంగా జరిగింది. ఏది ఏమైనా పార్టీకి వున్న కేవలం 26 మంది ఎమ్మెల్యేలలో రత్నకుమారి ఒకరు. పరిశీలకులుగా వచ్చిన ఓడిపోయిన బైరాగులు స్థానిక విషయాలను విస్మరించి ఇష్టమొచ్చినట్లు ప్రవర్తించడం కూడా బాగాలేదు. వారి నానా రభస జరిగి పార్టీని మరింత భ్రష్టు పట్టించింది. ఇదివరలో చెన్నారెడ్డిని ఆటకాయించి టిక్కెట్ సంపాదించు కొన్నాడు వుయ్యూరు ఎమ్మెల్యే చలపతిరావు. రత్నకుమారి కూడా ఆకోవలోనిదే. ముసలి ముతకా నాయకులు గౌరవంగా పార్టీ పెత్తనం నుంచి నిష్క్రమిస్తే మంచిది. లేకుంటే యువ నాయకుల చేతిలో పరాభవం తప్పదు. నాయకులు గెలిచేవాడికే టిక్కెట్ ఇచ్చి ఎన్నికల గుర్రం ఎక్కించడం మంచిది.

నెల్లూరు.-టి.వి. నారాయణ.

### ఓటర్ల పాట్లు

ఇటీవల జరిగిన స్థానిక సంస్థల ఎన్నికల ఓటర్ల జాబితాలో ఎన్నో అవక తవకలు జరిగాయి. పేర్ల మార్పు,

తరువ 15 పేజీలో

# ఒక్కసారి ఛాన్సిమ్మని ఇద్దరూ దీనంగా ప్రాధేయపడుతున్నారు!

మునిసిపల్ ఎన్నికల్లో పోటీ చేస్తున్న కాంగ్రెస్ అభ్యర్థి ఆనం వివేకానంద రెడ్డి, తెలుగుదేశం అభ్యర్థి వై.టి. నాయుడు స్థానిక నాయకుల పై ఆధార పడకుండా ప్రత్యక్షంగా ఓటరును కలిసే కార్యక్రమంలో మునిగి తేలుతున్నారు. ప్రధాన కూడళ్లలో ఏర్పాటు చేసిన సమావేశాల్లో ప్రజల పై వాగ్దానాల వర్షం కురిపిస్తున్నారు. స్వర్గీయ ఏసి సుబ్బారెడ్డిని ఆదర్శంగా తీసుకొని, ఆ బాటలో నడచి టౌన్‌లోని అన్ని ప్రాంతాల అభివృద్ధికి పాటు పడతానని ఆనం వివేకానంద రెడ్డి ప్రజలకు నమ్మ బలుకుతున్నారు. తనను ఛైర్మన్‌గా ఎన్నుకొంటే ప్రజాభిష్టం మేరకే ప్రతి నిర్ణయాన్నీ తీసుకుంటా నంటున్నారు. ప్రజలకు ఇష్టం లేని పనులు ఏనాడూ చేయనని చెబుతూ 365 రోజులూ ప్రజలకు అందుబాటులో వుంటా నంటున్నారు 25 సంవత్సరాలుగా రాజకీయాల్లో వుంటున్న తనకు ప్రజలకు సేవ చేసే భాగ్యం తొలిసారిగా లభించి నందువల్ల ఆదరించమని దీనంగా అభ్యర్థిస్తున్నారు. మునిసిపల్ పాఠశాలల్లో ఉపాధ్యాయుల పోస్టులు భర్తీ చేయిస్తానని, డ్రైనేజి, మంచి నీటి సమస్యలు తీరుస్తానని చెబుతూ దేవాలయాలు, మసీదులు, చర్చీలలో ప్రార్థనలు చేస్తూ ఓట్లు దగుతున్నారు.

మొదటి వారం రోజులు ఒంటరిగా ప్రచారం సాగించిన దేశం అభ్యర్థి శ్రీ వై.టి. నాయుడు, ఇప్పుడు ఎమ్మెల్యే రమేష్ రెడ్డితో జత కలసి ఓట్లు అభ్యర్థిస్తున్నారు. నెల్లూరు పట్టణాభివృద్ధికి ఎన్టీఆర్‌ను ఒప్పించి నిధులు తెప్పానంటు న్నారాయన. సమస్యల పరిష్కారానికి పాటు పడతానని ఒక్కసారి గెలిపించి అవకాశం ఇవ్వమని బ్రతిమ లాడుతున్నారు. వై.టి.కి. మద్దతుగా 15 తేది మంత్రి శ్రీ నల్లపరెడ్డి ప్రసన్న కుమార రెడ్డి, సర్వేపల్లి ఎమ్మెల్యే చంద్రమోహన రెడ్డి ప్రచారం నిర్వహించారు. ఆనం రామనారాయణ రెడ్డి, పివి ప్రసన్న రెడ్డి, కెవిఆర్ చంద్రయ్య, కె.వి. సుబ్బారెడ్డి వివేకాకు మద్దతుగా ప్రచారం సాగిస్తున్నారు.

## వినియోగదారుల ఫోరంను వినియోగించుకోండి!

వినియోగదారుల చట్టం పై సరియైన అవగాహన లేక పోవడంతో ప్రజలు చట్టం నుంచి తగినంత రక్షణ పొందలేక పోతున్నట్లు జాయింట్ కలెక్టర్ ఎం.అర్. నాయక్ చెప్పారు. 15 తేది వినియోగ దారుల దినోత్సవాన్ని పురస్కరించుకొని తన ఛాంబర్‌లో పత్రికల వారితో మాట్లాడారు. 91 లో నెల్లూరు ఫోరం నెలకొల్పిన తరువాత కేవలం 6,880 కేసులే నమోదయ్యాయిని; వీటిలో 5,672 పరిష్కారమైనట్లు వివరించారు. బ్యాంకులు, ఇన్సూరెన్సు, రవాణా, విద్యుత్, ఇంధన సరఫరా సర్వీసులు ఈ చట్టం పరిధిలోకి వస్తాయని తెలిపారు. అతి సామాన్యునికి సైతం చట్టానికి సంబంధించిన విజ్ఞానాన్ని అందించి నప్పుడు వినియోగదారుల ప్రయోజనాలు రక్షింప బడతాయి. అందుకు జిల్లాలోని వినియోగ దారుల సంఘాలు కృషి చేయాలని కోరారు. సమావేశంలో జిల్లా పౌర సరఫరాల శాఖాధికారి భరత్ రెడ్డి కూడా పాల్గొన్నారు.

డిఎస్‌పి బెదరింపు

# ఎన్నికల్లో దౌర్జన్యాలు చేస్తే కాల్చి పారేస్తాము!

మునిసిపల్ ఎన్నికలకు గాను టౌన్‌ను పోలీస్ దిగ్బంధనం చేయనున్నారు. ఈ వివరాలను డిఎస్పి లక్ష్మిరెడ్డి 15 తేది విలేఖరులకు తెలిపారు. పోలింగ్ రోజున అధికారుల పై దౌర్జన్యాలు చేయడం, బ్యాలెట్ బాక్సులు ఎత్తుకెళ్లడం, చించడం వంటి పనులు చేసిన వారిని పౌరులైనా సరే చంపవచ్చు నంటున్నారు. తాము చూస్తే కాల్చి పారేస్తారట. ఇలా చేసిన వారి పై కేసులు వుండవంటున్నారు. ఈ సడలింపు గొడవను సృష్టించదు కదా? ముస్లింల వలె బురఖాలు ధరించి వచ్చి దొంగ ఓట్లు వేసేందుకు ప్రయత్నిస్తే కఠిన చర్యలు తప్పవన్నారు. నర్తకి థియేటర్, చిన్నబజార్, వెంకట రమణ థియేటర్, కొండాయ పాళెం, జెండావీధి, సుబేదారుపేట, స్టోన్‌హౌస్ పేట, ఎద్దుల రేవు సంఘం, గాంధీబొమ్మ ప్రాంతాలలో పోలీస్ పికెట్ ఏర్పాటు చేస్తున్నారు. అయ్యప్పగుడి, ముత్తుకూరు రోడ్డు, నరుకూరు రోడ్డు, వెంకటేశ్వర పురం, పెన్నానది, రంగనాయకుల పేట, మైపాడు గేట్, పొదలకూరు రోడ్డులలో చెక్‌పోస్టులు ఏర్పాటు చేసి ప్రతి వాహనాన్నీ తనిఖీ చేస్తారట. ప్రతి రెండు వార్డులకు ఒక మొబైల్ పార్టీ, మఫ్టీలో 4 ప్రత్యేక పార్టీలు తిరుగుతూ అనుమానం వచ్చిన వారిని అదుపులోకి తీసుకొంటారట. రౌడీ షీటర్లను 200 మందిని గుర్తించారట; వారు 17 తేది నుండి ప్రతి రోజూ వుదయం, సాయంత్రం సంబంధిత పోలీస్ స్టేషన్లలో సంతకాలు చేయాలి. ఎన్నికల బందోబస్తులో అయిదుగురు డిఎస్పిలు, 8 మంది సిఐలు, 28 మంది ఎస్ఐలు, 50 మంది హెచ్.సిలు, 380 మంది కొరవ 15 పేజీలో

## నెల్లూరు సంగతులు

# అధికారం కోసం ఓట్లడగడం లేదు-

## అందుబాటులో వుండేందుకు అవకాశం ఇవ్వమంటున్నాం!



### ఆనం వివేకానందరెడ్డి

*ఎవరో, ఎటు వంటివాడో నెల్లూరు ఓటర్లకు*
*ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు*

| | | |
|---|---|---|
| విద్యవుంది | - | డిగ్రీ హోల్డరు |
| వినయం వుంది | - | అందరితో స్నేహితంగా మెలుగుతాడు |
| వివేకం వుంది | - | విఆర్ కాలేజిలో మార్పులు చూశారు |
| ఓర్పు వుంది | - | పదవి లేకున్నా పాతికేళ్ల ప్రజాజీవితంలో గడిపాడు |
| సేవాభావం వుంది | - | సింహపురి సేవాసమితి నిర్వాహకుడు |
| నిజాయితీ వుంది | - | ఒక్కరు కూడా వేలెత్తి చూపే తప్పు ఎప్పుడూ చేయలేదు |
| కలుపుగోలు తనం వుంది | - | మధ్యతరగతి వారితోనే కలసిమెలిసి వుంటాడు! |
| అవగాహన వుంది | - | టౌన్ మారుమూలలు కూడా తెలుసు |
| అనుభవం వుంది | - | ఇన్నేళ్ల ఎన్ని పోరాటాలు చేశాడో! |
| భేషజం లేదు | - | ఎవరికైనా అందుబాటులో వుంటాడు! |



నెల్లూరు మునిసిపల్ ఛేర్మన్‌గా గెల్పించమని ఓట్లడగడానికి అర్హతలన్నీ వున్నాయి. మీ ఆదరణ ఒక్కటే మిగిలి వుంది! ఈ ఎన్నికలలో ఇందిరా కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేస్తున్న ఆయనకు ఒక అవకాశం ఇవ్వండి; ఆదరించండి!

**హస్తం గుర్తుకే ఓటు చేయండి!**

*- టౌన్ బాగుండాలని కోరుకునే వారి కూటమి!*

**Published by Vemareddy Rajagopala Reddy**

# ఎందరో వెంకటగిరి రాణులు తమ పతుల చితులలో కాలిపోయారు!

(గత వారం కొరవ)

## సతీ సహగమన చిహ్నాలు

సతి రెండు రకాలని చెప్పవచ్చు 1) భర్త చనిపోయిన స్త్రీ తన భర్త శవంతో పాటు చితిలో సజీవంగా ఆహుతి అవడం. 2) కన్యకాని, మరో స్త్రీ కాని అన్యపురుషుల నుండి తమ మానాన్ని కాపాడుకోవలసి వచ్చిన సమయం అగ్నిలో దూకడం. ఈ రెండో పద్ధతి యుద్ధ సమయంలో క్షత్రియ వంశాల స్త్రీలు నిర్వర్తించడం జరిగేది. సతి అమలు జరపడంలో కూడా రెండు పద్ధతులున్నాయి. భర్త శవంతో పాటు భార్య కూడా అగ్ని ప్రవేశం చేసే పద్ధతిని సహగమనం అంటారు. భర్త ఎక్కడో చనిపోతే ఆ వార్త తెలిసిన తర్వాత తనొక్కతే అగ్నిప్రవేశం చేయడం అనే పద్ధతిని 'అనుగమనం' అంటారు. ఈ రెండు పద్ధతులకు సంబంధించిన సంఘటనలు కోకొల్లలుగా భారతదేశంలో జరిగాయి.

'సతి' అనేది భారత దేశంలో ఎప్పుడు మొదలైందో చెప్పలేం. మొట్టమొదటగా క్రీ.పూ. 4వ శతాబ్దంలో పంజాబ్ ప్రాంతంలో జరుగుతుండగా చూశామని గ్రీకుల వ్రాతలవల్ల తెలుస్తున్నది. శాసన పరంగా చూస్తే క్రీ.శ. 6 వ శతాబ్దానికి చెందిన శాసనాలలో కొందరు స్త్రీలు సహగమనం చేసిన వివరాలు తెలుస్తున్నాయి. మహా భారతం, రామాయణం, కొన్ని పురాణాలలోనే కాకుండా మధ్య చారిత్రక కాలానికి చెందిన సాహిత్యంలో కూడా 'సతి' కి సంబంధించిన వివరాలున్నాయి.

సతీ సహగమనానికి సంబంధించిన సంఘటనలు నెల్లూరు జిల్లాలో పలుచోట్ల జరిగినట్లుగా పేరంటాలమ్మ దేవాలయాలు, విగ్రహాలవల్ల తెలుస్తున్నది. నెల్లూరు చరిత్రలో అతి ప్రాచీన సహగమన సంఘటన రణతిక్కన భార్య జాణమ్మదని చెప్పవచ్చు. మనుమ సిద్ధి రాజుల కాలంలో జరిగిన కథగా ప్రచారం పొందిన "కాటమ రాజు కథ"లో ఈ విషయానికి సంబంధించిన వివరాలున్నాయి.

పల్నాటి వీర చరిత్ర, కాటమ రాజు కథ అనేవి రెండు ఆంధ్రుల జానపద ఇతిహాసాలు. కాటమ రాజు కథలో 19వ వీర గాథ" ఎఱ్ఱగడ్డ పోట్లాట" అందులో మొదటి కాండలో ఖడ్గతిక్కన కథవుంది. ఖడ్గతిక్కన నెల్లూరును పాలించిన తెలుగు చోడరాజు నల్లసిద్ధి (క్రీ.శ. 1290-'97) వద్ద మంత్రిగా, దండ నాయకుడుగా ఉండేవాడు. నల్లసిద్ధి రాజుకు పుల్లరి విషయంగా కాటమ రాజుతో యుద్ధం వచ్చింది. ఈ యుద్ధంలో తిక్కన నిలబడలేక యుద్ధభూమిని వదిలి ఇంటికి వస్తాడు. ఇంటివద్ద అతని తల్లి, భార్య, అతని పిరికితనాన్ని ఎత్తి పొడుస్తూ హేళన చేస్తారు. తిక్కన తిరిగి కొంత సైన్యాన్ని తీసుకుని యుద్ధభూమికి వెళ్లి శత్రు సైన్యాన్ని చెండాడి అక్కడే వీర మరణం పొందుతాడు.

అప్పుడు రణతిక్కన భార్య సహగమనం చేయడానికి సచేల స్నానం చేసి, బ్రాహ్మణులకు దానాలిచ్చి, రణభూమికి ప్రదక్షిణం చేసి తన పతి కళేబరం కనబడక పోయేసరికి స్వామిని ప్రార్థించి " నేను ప్రతి వతనైతే పతి శిరస్సు కనిపిస్తుంది". రణతిక్కనా అని పిలిచినంతటనే శిరస్సు యుద్ధ భూమిలో పడివున్న కళేబరాల మధ్య నుండి పైకి ఎగిరి పడిందట. ఆ

కొరవ 10 పేజీలో

### నెల్లూరు జిల్లా ప్రాచీన చరిత్రకు నూతన వ్యాఖ్యానం!

కొల్లూరి సాయిభక్త కేశవ

సాంకేతిక సహాయకుడు, పురావస్తుశాఖ, నెల్లూరు

# చావు బ్రతుకుల్లో వ్రాసిన చావు భయం వద్దనే కావ్యం!

## జ్వరతరంగిణి

ఈ గేయ కావ్యం మృత్యువు నుంచి ఉద్భవించింది. మృత్యువుతో పెరిగింది. మృత్యువులో మెలిగింది. మృత్యువు కౌగిట్లో నలిగింది. మృత్యువు విన్యాసాలను వివరించింది. మృత్యు రహస్యాలను విశదపరచింది. మృత్యువును ప్రబల శత్రువుగా భావించి పోరాటం సలిపింది. మృత్యువును ఓడించి గెలిచింది.

ఈ గేయ కావ్యం యిలా మృత్యుమయం కావటానికి బలమైన కారణముంది. ఈ కావ్య రచయిత దుత్తా బాబూరావు హైదరాబాద్ ఓ హెచ్.ఇ.ఎల్.లో పనిచేస్తూ భయంకరమైన క్యాన్సరు వ్యాధికి గురయ్యాడు. దాదాపు సంవత్సర కాలం వెల్లూరు సి.ఎం.సి. ఆసుపత్రిలో చికిత్స పొందారు. మరణ శయ్య మీద పడుకున్నట్టు ఆసుపత్రి పడక మీద నిస్సహాయంగా పడున్నాడు. ఆయన శరీరంలోని అణువణువులోకి, రక్తనాళాల్లోకి, మెదడు పొరల్లోకి మృత్యువు నీలి నీడలు దూసుక పోగా మృత్యువును నిత్యమూ స్మరించ సాగాడు. ఎప్పుడు వీలైతే అప్పుడు కబళించేందుకు ఆయన చుట్టూ మృత్యువు తిరుగుతూ వుంటే, లోగిలో ఒక అంతర్గత సన్నిహితుడు, ధీశాలి దాగున్నాడనే దృఢ నమ్మకం ఆయన ఆలోచనా ధోరణిలో తళుక్కు మన్నది. అదే మనో ధైర్యం. ఆ మనోధైర్యాన్ని మృత్యువు పై సంధించాడు. మృత్యువును జయించి పునర్జన్మ పొందారు.

మృత్యువు అడుగుల చప్పుడు, మృత్యువు రణవిన్యాసం, మృత్యు వినోదం యివన్నీ. స్వతహాగా గేయకవి యైన బాబూరావు కవితా హృదయాన్ని కదిలించాయి. భావాలు రెచ్చగొట్టాయి.

| |
|---|
| గ్రంథసమీక్ష |
| రచయిత |
| దుత్తా బాబూరావు |
| సమీక్షకుడు |
| గ్రిద్దలూరు గోపాలరావు |
| ప్రతులకు |
| విశాలాంధ్ర బుక్‌హౌస్ |
| బ్యాంక్ సీట్ |
| హైదరాబాద్ - 500 001. |
| వెల. రూ. 25/- |

ప్రాణాలు పిడికిట పట్టుకొని, గుండెలు చేత బట్టుకొని ఆ అనుభవాలను అక్షరాలుగా మలిచాడు. ఆ అక్షరాలను కాగితం మీద నిలిపేందుకు చేతి వేళ్లు సహకరించని బలహీన దశలో ఆయన చెప్తుంటే ఆయన సతీమణి శ్రీమతి సుబ్బరత్నమ్మ వ్రాసింది. ఈ గేయ

కొరవ 14 పేజీలో

# విద్రోహం లేకుంటే వివేకా విజయుడే!

సింహపురి పౌర సింహాసనం పరిచిది? నెల్లూరు ప్రతిష్ఠను పెంచడం ద్వారా, తమ కీర్తి ప్రతిష్టలూ పెంచుకొని, దానికొక హుందాతనాన్ని గౌరవాన్ని కట్టబెట్టిన స్వర్గీయ ఎసి. ఆర్‌ఎల్ రెడ్డి వంటి వారు ఆసీనులైన, ఆ నిజమైన సింహాసనం వంటి కుర్చీలో ఎవరు సుఖాసీనులు కోరుతున్నారు?

రెండంటే రెండు రోజులలో ఓటరు నిర్ణయం వెలువడ బోతున్నది; తమ తీర్పును బ్యాలెట్ పెట్టెలో



వేయడానికి ఇప్పటికే పౌరులు సంసిద్ధులై వుంటారు. ఈ చివరి క్షణంలో వూహాగానాలు చేయడం దుస్సాహసమే. కాని మనసు వుండబట్టదు కదా?

ఒక్క మాటలో జరుగనున్నది జోస్యం చెప్పాలంటే - ఆనం వివేకానంద రెడ్డి విజయుడై నట్లే లెక్క. ఆ అంచనాను స్పష్టంగా తెల్పి చెప్పడానికి

సందేహించ వలసిన అవసరం కన్పడదం లేదు; తటపటాయించ వలసిన అగత్యం ఏమీ లేదు. వివేకానంద రెడ్డి గెలుస్తున్నా డనడం కంటే, తెలుగుదేశం వైటి నాయుడు గెల్పిస్తున్నా డనడం సమంజసం. విజయం పట్ల మితిమీరిన విశ్వాసంతో వైటి నాయుడు వేస్తున్న ఒక్కొక్క తప్పటడుగు, వివేకానంద రెడ్డి విజయానికి ఒక్కొక్క ముందడుగు వుపకరిస్తున్నాయన్నవాస్తవ పరిస్థితి అది!

కాంగ్రెస్‌లో ఆనం వివేకానంద రెడ్డికి అనూహితంగా అన్ని పక్షాల నుంచి మద్దతు, సహకారం లభిస్తున్నాయి. తన విషయంలో ఇంతటి సమైక్యత సాధ్యమని వివేకా కూడా అనుకొని వుండరు. పోటీకి ఆయన పేరు విన్నదే నాటికి ఒక్క జనార్దన రెడ్డి తప్ప సమర్థించిన వారెవ్వరూ లేరు. కాని ఈ రోజు వ్యతిరేకించే వారు, కనీసం బయటకు పబ్లిక్‌గా దెబ్బ తీసేవారు ఒక్కరూ కన్పించడం లేదు. పాతికేళ్ల పాటు టౌన్ రాజకీయాలలో తాను చేసిన వెట్టి చాకిరి, పదవి కోసం చకోర పక్షి కంటే సహనంగా జరిపిన నిరీక్షణ అన్నాళ్లకు ఫలించాయి వివేకానంద రెడ్డికి!

## * టౌన్‌లో కాంగ్రెస్ మోజు వెల్లివిరుస్తున్నది!

## * వైటి నాయుడి అతి విశ్వాసమే అపజయానికి దారితీస్తున్నదా?

నామినేషన్ల నాటికి ఎదురు బడితే కత్తులతో పొడుచు కొంటారేమో నన్నంత శత్రువులుగా మెలిగిన మాగుంట, ఆనం వర్గాలు ఏకమై ఎన్నికలలో పనిచేసే పరిస్థితి ఏర్పడడం వివేకానంద రెడ్డి అదృష్టమే. మాగుంట సుబ్బరామ రెడ్డి ప్రత్యక్షంగా రంగ ప్రవేశం చేయలేదు గాని, ఆయన ప్రతినిధిగా శ్రీ పి.వి. ప్రసన్న రెడ్డి ప్రతి దినం ప్రచారం చేస్తున్నారు. ప్రసన్న చాలా పెద్ద మనసు చేసుకున్నట్లే లెక్క. మూడు నెలల క్రితం తన ఓటమికి కారణాలు మరచి, సహాయ పడడం అభినందనీయమే కదా?

మనసును ఏ రీతిలో సమాధాన పరచుకున్నారో, కోపాన్ని ఎట్లా అదుపులో పెట్టుకున్నారో తెలియదు కాని, మాజీ ఎమ్మెల్యే శ్రీ కె.వి. సుబ్బారెడ్డి గారు కూడా ప్రత్యక్షంగా ప్రచారంలో పాల్గొంటున్నారు. కౌన్సిలర్ల టిక్కెట్ల పంపకంలో అలుకలు, ఆగ్రహాలు రౌత్రినా జనార్దన రెడ్డి వర్గ ప్రతినిధులైన దేవకుమార రెడ్డి, సునీల్ కుమార్ రెడ్డి మనఃస్ఫూర్తిగా సహాయ పడుతున్నారు. సిబిశేషారెడ్డి సరేసరి! కాంగ్రెస్ పార్టీలో ఏ ఒక్కరూ తప్పు పోకుండా వివేకానంద రెడ్డి విజయానికి తమ వంతు సహకారం అంద జేస్తున్నారు. ఆయన గెలుపుకు గ్యారంటీ కల్పిస్తున్న తొలి అంశం ఈ ఐక్యతే!

దీనికి తగినట్లు మంతల ఎన్నికలలో కాంగ్రెస్ అనూహ్య విజయం సాధించడం టౌన్‌లో కాంగ్రెస్



సానుభూతి పరులు, అభిమానులు, కార్యకర్తలలో ఉత్సాహం పెంచింది. తటపటాయింపుతో, తటస్థంగా వుండిన వారు కూడా ధైర్యంగా వీధుల్లోకి వచ్చేస్తున్నారు. ఈ మార్పు వివేకా ప్రచారం వూపును ఉధృతం చేసింది. టౌన్‌లో కాంగ్రెస్ మోజు వెల్లివిరుస్తున్నది.

అవతలి పక్షంలో వైటి నాయుడు చాలా సమస్య లెదుర్కొంటున్నారు. తెలుగుదేశం టిక్కెట్ రావడమంటే గెల్చినట్లే లెక్క న్న విశ్వాసంతో నామినేషన్ వేశాడు వైటి. పదేళ్లకు పై నుంచి టిక్కెట్లు చేతికంది, జారి పోవడం తప్ప ఎప్పుడూ ఖాయం కాలేదన్న సానుభూతితో పది మంది స్నేహితులు ప్రక్కన చేరే సరికి వైటిలో ఆత్మవిశ్వాసం పెరిగి పోయింది. ఆ అతిశయమే ఎమ్మెల్యే శ్రీ టి. రమేష్ రెడ్డి సంపూర్ణ సహకారం పొందడానికి అడ్డంకిగా పరిణ మించింది. టౌన్‌లో తెలుగుదేశం పార్టీ పైన పూర్తి అదుపు, కార్యకర్తల పై పట్టు కల్గిన వాడు రమేష్ రెడ్డి ఒక్కడే. ఆయన మనసు గాయపరచడం ద్వారా వైటి నాయుడు



ఉపసంహరణల తర్వాత వారం రోజులకు కాని రమేష్ రెడ్డి ప్రచారానికి రాలేదు. ఈలోగా వైటి నాయుడును సిపిఎం పార్టీ హైజాక్ చేసేసింది. ప్రచారమంతా వారి ఆధ్వర్యంలో జరగడంతో తెలుగుదేశం కార్యకర్తలు నిర్వీర్యులై పోయారు.

కొరవ 9 పేజీలో

జమీన్‌రైతు
సంవత్సరచందా రూ. 100/-
అర్ధసంవత్సర చందా రూ. 50/-

## నెల్లూరు ముచ్చట్లు
### [illegible]

**జనార్ధనరెడ్డి**

రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి 16తేది వాకాడు వచ్చారు. తనపై పునః అభిమానం ప్రదర్శించిన వెంకటగిరి ఓటర్లకు కృతజ్ఞతలు తెలియ జేసుకొంటున్నారు. 20తేది నెల్లూరులో మండల ఎన్నికల కాంగ్రెస్ విజయోత్సవ సభ నిర్వహించ నున్నారు.

**డిఇటికి డాక్టరేట్**

నెల్లూరు టెలిఫోన్స్ డివిజనల్ ఇంజనీరు శ్రీ కె. శౌరి రాజన్ గారికి వెంకటేశ్వర విశ్వ విద్యాలయం ఎకనామిక్స్‌లో డాక్టరేట్ ప్రదానం



చేసింది. " అర్బన్ ఇన్‌ఫార్మల్ సెక్టార్ -ఎ కేస్ స్టడీ ఆఫ్ నెల్లూరు, ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ " అనే అంశంపై ఆయన సమర్పించిన పరిశోధనా వ్యాసానికి పిహెచ్‌డి పట్టా బహూకరించారు.

శౌరి రాజన్ గారు 1965లో జెఇగా సర్వీసులో చేరి మెట్టు మెట్టు ఎక్కుతూ డిఇటిగా ప్రమోషన్ పొందారు. 1984లో అమెరికా వెళ్ళి శిక్షణ పొంది వచ్చారు. జాతీయ, అంతర్జాతీయ మ్యాగజైన్లలో 20కి పైగా వ్యాసాలు వ్రాశారు. రేపు అక్టోబరులో స్విట్జర్లాండ్‌లోని జెనీవాలో జరుగనున్న ప్రపంచ టెలికాం సదస్సుకు ఆయనకు ఉపన్యాసకుడుగా ఆహ్వానం అందింది. చాలా అరుదైన గౌరవం ఇది.

పూర్తి సలపని ఉద్యోగ బాధ్యతల నిర్వహణ కొనసాగిస్తూనే, పరిశోధన సాగించి పిహెచ్‌డి సాధించడమంటే ప్రశంసల కతీతమైన విషయం. శౌరి రాజన్ గారికి మా అభినందనలు.

**శివారెడ్డి కుమారుడి దుర్మరణం**

జమీన్‌రైతు శివారెడ్డి పెద్ద కుమారుడు, విఆర్ కాలేజి లెక్చరరు శ్రీ ఆదిత్య కుమార్ రెడ్డి (45) 15 తేది ఉదయం విషాద మరణానికి గురైనారు. స్కూటర్‌లో వెళ్తుండినాడట. గూడ్స్‌షెడ్ దగ్గర, ట్రంకురోడ్డుపైన వెళ్తుండిన ఒక లారీ వెనుక చక్రాల క్రిందపడి, అక్కడికక్కడే మరణించాడు. కళ్లలో నీళ్లు ఇంకిపోయే విషాద భరిత దృశ్యమిది.

ఆదిత్య నెమ్మదస్తుడైన యువకుడు. డాక్టరేట్ చేసిన విద్యాధికుడు. ఈమధ్యే కొత్త ఇల్లు కట్టి గృహ ప్రవేశం చేశాడు. బంగారు వంటి భవిష్యత్‌ను విధి ఒక్క క్షణంలో కాల రాచి వేసింది. ఆయనకు భార్య, ఒక కుమారుడు వున్నాడు.

ముసలి వయస్సులో శివారెడ్డి గారికి తేరుకోలేని శోకం మిగిల్చిందీ దుర్ఘటన. ఆయన కళ్లనీళ్లు తుడవడం ఎవరికి సాధ్యం? వారి కుటుంబానికి ప్రగాఢ సంతాపం.

# తెలుగుదేశం గెల్చినట్లే!

గూడూరు మునిసిపాలిటిలో తెలుగుదేశం గెలుపు ఖాయమనే చెప్పాలి. అభ్యర్థి శ్రీ పి. సునీల్ కుమార్ అదృష్టవంతుడు. చిన్న వయస్సులోనే పెద్ద పదవి పొంద బోతున్నారు.

కాంగ్రెస్ అభ్యర్థి డి. సురేంద్రబాబును గెల్పించడానికి ఎల్లసిరి గోపాలరెడ్డి, వేమారెడ్డి వెంకట కృష్ణారెడ్డి లిర్వురూ విశ్వప్రయత్నం చేస్తున్నా, అది ఫలించే కృషికాదు. మండల ఎన్నికలలో విజయం ద్వారా కాంగ్రెస్ కార్యకర్తలలో ఎంతటి ఉత్సాహం రేకెత్తిందో, తెలుగుదేశంలో అంత భయమూ కల్గింది. వారు తమ పార్టీని కాపాడుకోవడానికి మరింత వ్యవస్థీకృతంగా పనిచేస్తున్నారు.

వేమారెడ్డి రామచంద్రారెడ్డిగారి స్వతంత్ర అభ్యర్థి పోలిసాటి మస్తానయ్య పోటీ నామకర్థమే. రామచంద్రారెడ్డి గారు బహిరంగంగా తన అనుచరులకు మద్దతు పలక లేక, తెలుగుదేశం వారు తనను మాట వరసకు కూడా ప్రచారానికి పిలువలేదన్న అవమానం దిగ మ్రింగుకోలేక సతమతమై పోతున్నారు. ఆయన ఇప్పుడున్న పరిస్థితులలో అధికారంలో వున్న తెలుగు దేశం పార్టీని ధిక్కరించి వ్యవహరించే సాహసం చెయలేరు.

వార్డుల వారీగా చూస్తే మాత్రం చాలాచోట్ల కాంగ్రెస్ మెరుగ్గా వుంది. వేమారెడ్డి రామచంద్రారెడ్డి గారి స్వతంత్ర అభ్యర్థులూ మంచి పోటీ ఇస్తున్నారు.

1వార్డులో వేమారెడ్డి క్యాండిడేట్ సుబ్రహ్మణ్యంకు, మరొక స్వతంత్రుడు చెంచురామయ్యకు మధ్య పోటీ వుంది; 2 వార్డులో కాంగ్రెస్ పి. సుజాతమ్మ, వేమారెడ్డికి చెందిన వై. ప్రసూనతో పోటీ

**గూడూరు మునిసిపల్ ముచ్చట్లు**

పడుతుంది. దేశం సరళ వేస్ట. 3 వార్డులోనూ కాంగ్రెస్ ఫాతిమాకు, వేమారెడ్డి - భవానికి పోటీ. ఫాతిమాకే ఛాన్సు ఎక్కువ. 4 వార్డులో సిపిఎం కాలేషా బెటర్‌గా వున్నాడు. 5 వార్డు ఎల్లసిరి స్వంతవార్డు. ఆయన అభ్యర్థి సభాపతి గెలుస్తాడు. 6 వార్డులోనూ ఎల్లసిరి పలుకుబడితో కాంగ్రెస్ కోటేశ్వరరావు గెలవాలి. తెలుగు దేశం జనార్ధన్ స్థానికుడు కాదు.

7 వార్డులో వేమారెడ్డి అభ్యర్థి లేదు. తెలుగుదేశం సరస్వతికి ఛాన్సులు ఎక్కువ. 8 వార్డులోనూ దేశం సుబ్బయ్యకే అవకాశం. 9 వార్డులో దేశం కోటేశ్వరరావు ఓట్లను వేమారెడ్డి-ధీరయ్య చీలుస్తున్నారు. అయినా గెలుపు అతనిదే కావచ్చు. డబ్బు ధారాళంగా ఖర్చవుతున్నదిక్కడ. 10లో కాంగ్రెస్ గోవిందమ్మ గ్యారంటీ అంటున్నారు. 11లో దేశం రజియాబి బెటర్‌గా వుంది. 12వార్డులో రెడ్డి బలిజల మధ్య కులపోరు జరుగుతుంది. ముస్లిం ఓటర్ల సహకారంతో తెలుగుదేశం వెంకట్రావు గెలుస్తాడని అంచనా. 13 వార్డులో కాంగ్రెస్ అడ్రసు లేదు. వేమారెడ్డి - వెంకటేశ్వర్లు గెలవవచ్చు. 14లోనూ అదే పరిస్థితి. యాదవులందరూ ఒకటైతే తప్ప- వేమారెడ్డి - రాధాకృష్ణారెడ్డికే ఛాన్సు.

15 వార్డు కాంగ్రెస్ గోపీకృష్ణ న్యాయవాది, కోర్టుపక్షి; ప్రచారం ముమ్మరంగా వుంది. చెప్పడం కష్టం. 16 లో దేశం, కాంగ్రెస్ మహిళలు అవుల మంజుల, రూప్సీరాణి ఇల్లిల్లు తిరిగి బొట్టుపెట్టి ఓట్లడుగుతున్నారు. ఎవరు గెలుస్తారో మరి!

17లో తెలుగుదేశం తరఫున విలేఖరి గౌసబాషా పోటీచేస్తున్నాడు. మాటకారి. కలుపు గోలు తనం వుంది. ముస్లిం ఓటర్లు సహకరిస్తున్నారు. గెలవడం గ్యారంటీ. 18లో త్రికోణ పోటీ. దేశం నవనీతమే గెలవాలి. 19

కొరవ 9 పేజీలో

# కలికి, వంటేరు ప్రతిష్టా పోరాటం

కావలి మునిసిపాలిటికి సంబంధించి పోలింగ్ రెండు రోజులలోకి వచ్చినా ఇంకా పరిస్థితి గందరగోళంగానే వుంది. ఎవరు గెలుస్తారో, ఎవరు ఓడుతారో అంచనా కట్టడం సాధ్యం కావడంలేదు. గిరిజన మహిళకు రిజర్వు కావడంతో అభ్యర్థులు ఎవరనేది చర్చలోకి రావడంలేదు. వారి అర్హతలు ఎవరూ పరిశీలించడం లేదు. ఎమ్మెల్యే కలికి యానాది రెడ్డి, ఓడిపోయిన ఎమ్మెల్యే వంటేరు వేణుగోపాలరెడ్డిల మధ్య ప్రత్యక్ష ప్రతిష్టా సమరంగా జరుగుతూంది ఎన్నిక.

యానాదిరెడ్డిగారు తన ముప్పయ్యేళ్ల రాజకీయానుభవంతో ఒక క్రమ పద్ధతిలో ఎన్నికల వ్యూహం రచించి, అమలు చేస్తున్నారు. గ్రంధి యానాదిశెట్టి యంత్రాంగం ఆయనకు వుపకరిస్తున్నది. తెలుగుదేశంలో బహునాయకత్వం సమస్య వంటేరు వేణుగోపాలరెడ్డిని చికాకు పెడుతున్నది. అనుభవం లేకున్నా వ్యాపార యాజమాన్య నిర్వహణ లోని వృత్తి పర విధానంలో, ప్రొఫెషనల్ స్టైయిల్‌తో రాజకీయాలు నడుపుతున్నాడు వేణుగోపాలరెడ్డి. అందువల్లే మొన్న తనను ఓడించిన గొట్టిపాటి కొండపనాయుడుతో రాజీపడి కలుపుక పోయాడు. ఈ కలయిక ఆయనకు మండల ఎన్నికలలో వుపకరించింది. అదే వూపుతో మునిసిపాలిటీని కైవశం చేసుకోవాలని యత్నిస్తున్నారాయన. అయితే టౌన్‌లోని తెలుగు నాయకులు ప్రచారరథాన్ని తలా ఒక దిక్కుకు లాగుతున్నారు. మండల ఎన్నికలోని డివిజన్ మొత్తంమీద విజయభేరి

**కావలిలో హోరాహోరీ పోరు**

మ్రోగించడంతో ఆ వూపు టౌన్‌లో వుపకరిస్తుందని వారి ఆశ.

మొత్తం 28 వార్డులలోనూ తెలుగుదేశం, కాంగ్రెస్‌లు అభ్యరులను నిలబెట్టాయి. బిజెపి 19 స్థానాల్లో పోటీ పడుతుంది. సిపిఎం నాలుగు వార్డుల్లో సిపిఐ మూడు వార్డులలో విడిగా రంగంలో వున్నాయి. 4 వార్డులలో మాత్రం దేశం, కాంగ్రెస్‌లు ముఖాముఖి తలపడుతున్నాయి. ఐదు వార్డులలో త్రికోణపు పోటీవుంది.

తెలుగుదేశానికి మంత్రి నల్లపురెడ్డి ప్రసన్న కుమార్ రెడ్డి ప్రచారం చేశారు. దురదృష్ట వశాత్తు అది తుస్సుమన్నది. ఒక్క సభకూ జనం రాలేదు. ఈ వెల్తికి కారణం ఓటర్లలో ఆసక్తి లేకనా లేక సభలకు సంబంధించి సరైన సమాచారం లేక పోవడమా అన్నది అర్థం కాక నాయకులు తలలు బాదుకొంటున్నారు. వచ్చిన జనలో కూడా మంత్రి ప్రసంగానికి వినుక్కున్నారు. దేశం నుంచి బహిష్కృతుడైన గొట్టిపాటి కొండప నాయుడు ముందుకు వచ్చి పార్టీలోనే నికరంగా వుంటున్న ఎం.వి నారాయణ వెనక్కు తగ్గవలసి రావడం కార్యకర్తలలో విమర్శలకు దారితీస్తున్నది.

కాంగ్రెస్‌కు సంబంధించి ఒంగోలు ఎమ్పీ శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డి ప్రచారం నిర్వహించారు.

రెండు పార్టీల మధ్య పోటీ తీవ్రంగా వుంది. ఛైర్మన్ అభ్యర్థి ఓటముల సంగతి తేల్చి చెప్పడం అసాధ్యం. కాని వార్డులలో మాత్రం అధిక భాగం కాంగ్రెస్‌కే వస్తాయన్నది నిజం. బ్రాహ్మణులు, వైశ్యులు, ముస్లింలు కాంగ్రెస్ పక్షంలోనే వున్నారు. వారిలో మార్పులేదు. వార్డులలో విజయం ద్వారా, క్రాస్ ఓటింగ్ జరగకుండా నివారించుకో గల్గితే కాంగ్రెస్ ఛైర్మన్ సీటు కూడ గెల్చుకోవచ్చు.

# ప్రతీకారం తీరింది!

మండల ఎన్నికల ద్వారా జిల్లాలో కాంగ్రెస్ పార్టీ శాసన సభ ఎన్నికలలో తనకు జరిగిన ఓటమి పరాభవానికి ప్రతీకారం తీర్చుకున్నది. తెలుగుదేశాన్ని దిమ్మ తిరిగే దెబ్బ తీసింది. జిల్లా పరిషత్‌లో మెజారిటీ

**మండల ఎన్నికల్లో తెలుగుదేశానికి దిమ్మతిరిగే దెబ్బ!**

స్థానాలు [illegible] పరమైనా, ఛైర్మన్ పదవి వారికే దక్కినా నిర్వీర్యమై పోయిందనుకున్న కాంగ్రెస్ పార్టీ నూతనోత్తేజంతో తల పైకెత్తి సవాల్‌గా నిలవడమే ఈ ఎన్నికల్లోని విశేష పరిణామం.

మండల నియోజక వర్గాలకు సంబంధించి 530 స్థానాలకు ఎన్నికలు జరిగితే తెలుగుదేశం 269 స్థానాలు, కాంగ్రెస్ 215 స్థానాలు గెల్చుకున్నాయి. అంటే దాదాపు 41 శాతం సీట్లు కాంగ్రెస్ పరమై నాయన్న మాట. అప్పటికి ఏ జిల్లా కాంగ్రెస్ నాయకుడూ ఈ ఎన్నికల పట్ల ఉత్సాహం చూపలేదు. వారే గనుక కొంచెం శ్రద్ధ చూపి వుంటే, సరైన అభ్యర్థులను నిలబెట్టి ప్రచారం చేసి వుంటే మెజారిటీ కాంగ్రెస్‌కు రావడమే కాదు, జిల్లా పరిషత్ కూడా వశమై వుండేది.

వెంకటగిరిలోని నాలుగు మండలాలు - డక్కిలి, బాలాయపల్లి, వెంకటగిరి, ఓజిలి మండలాలలో మెజారిటీ స్థానాలు సంపాదించి అద్వితీయుడుగా నిల్చారు జనార్ధన రెడ్డి. జిల్లా పరిషత్ స్థానాలకు సంబంధించి కూడా ఆయన ఎన్నిక జరిగిన 3 స్థానాలనూ గెల్చుకున్నారు. మూడు నెలల క్రితం ఇదే నియోజక వర్గంలో 15 వేల ఓట్లతో ఓడిన జనార్ధన రెడ్డి, ఇప్పుడు ఆ లోటు పూర్తి దాదాపు 18 వేల ఓట్ల ఆధిక్యత సంతరించి పెట్ట గలిగాడు. వెంకటగిరి మండలంలో 18 స్థానాలుంటే 15 కాంగ్రెస్ గెల్చిందంటే జనార్ధన రెడ్డి తిరిగి కూడగట్టుకున్న ప్రజాభిమానం ఎంతో వూహించవచ్చు.

అల్లూరులో ఓడిపోయిన విష్ణువర్ధన రెడ్డి కూడా ఇదే తీరులో ప్రతీకారం తీర్చుకున్నారు. తన నియోజక వర్గంలోని నాలుగు జిప్రప స్థానాల్లో దగదర్తి మినహా మిగిలిన మూడింటినీ సాధించారాయన. ఈ మూడు మండలాలూ కాంగ్రెస్ పరం కానున్నాయి.

ఆత్మకూరు డాక్టర్ సుందర రామరెడ్డి గారు అనంతసాగరం కలువాయి, ఆత్మకూరు జి.ప్ర.ప. స్థానాలు గెల్పించి తన సత్తా నిరూపించారు. రాపూరులో ఆనం రామనారాయణ రెడ్డి పొదలకూరు కోల్పోయినా రాపూరు గెల్పించారు. దొరవారిసత్రం, తడలలో గెలుపొందడం పనల పెంచలయ్యకే ఆశ్చర్యం కల్గించి వుంటుంది. సర్వేపల్లిలో సివి శేషారెడ్డి శతపోరాడు కాని, జెకె. మాగుంటల సహాయ నిరాకరణ ఎదురు కావడం వల్ల ఒక్క నెల్లూరు రూరల్ మాత్రం గెల్పించు

కొరవ 9 పేజీలో

## మున్సిపాలిటి

7 పేజీ కొరవ

నైటి నాయుడు తమను కలుపుకుని పోవడానికి ప్రయత్నించక పోవడమేకాక, వార్డుల్లో ప్రచారానికి వచ్చినప్పుడు తన ఒక్కడి ఓటు మాత్రం అడిగి వెళ్ళి పోతున్నాడని 32 మంది తెలుగుదేశం వార్డు కౌన్సిల్ అభ్యర్థులు బహిరంగంగా పత్రికా ప్రకటన చేశారు. ఆ పార్టీలోని అనైక్యతకు, చీలికలకు, ముఠా కుమ్ములాటలకు సచ్చి రుజావు ఈ ప్రకటన. ఎన్నికల సమయంలో అందర్నీ కలుపుకు పోవడానికి ప్రయత్నించడం రాజకీయ విజ్ఞత. విద్వేషాలు, విబేధాలతో పట్టుదలలకు పోవడం నైటి నాయుడి అనుభవ రాహిత్యాన్ని సూచిస్తున్నది. రమేష్‌రెడ్డి అప్పటికి టౌన్‌లో పలుచోట్ల తిరుగుతూ తెలుగుదేశానికి ప్రచారం చేస్తున్నాడు కాని, నైటి దానిని వుపయోగించకోలేక పోతున్నాడు. బాలాజీ నగర్‌లో ప్రచారం చేస్తూ, రమేష్ రెడ్డి ఇంటి వరకు వెళ్ళి వెనుదిరిగి వచ్చేశాడట- ఆ ఇంటికి వెళ్తే రమేష్‌రెడ్డిని ఓటడగ వలసి వస్తుందని. ఈ పరిస్థితులలో నైటి గెలుపు ఎట్లా సాధ్యం? కేవలం సిపిఎం కార్యకర్తల అండను నమ్ముకుని ధైర్యంగా వున్నాడు నైటి.

కౌన్సిలర్లకు సంబంధించి కాంగ్రెస్‌లో చాలా భాగం వార్డులలో గ్రూపులన్నీ ఐక్యంగానే వ్యవహరిస్తున్నారు. అందువల్ల ఈ వార్డుల్లో ఆ కౌన్సిలర్లకు విజయవకాశాలు పుష్కలంగా వున్నాయి. అక్కడక్కడా కాంగ్రెస్ గ్రూపు తగాదాలు ప్రతిఫలించక పోవడం లేదు. కాని వాటి సంఖ్య తక్కువ. తెలుగుదేశం విషయంలో ఐక్యంగా పనిచేసే వార్డుల సంఖ్య తక్కువ; కలహించుకునే వాటి సంఖ్య ఎక్కువ. రెండు ఓట్లు వేయవలసిన పరిస్థితులు సాధారణంగా ఓటరు క్రాస్ ఓటింగ్‌కు పాల్పడరు. ఛైర్మన్‌కు ఓటు వేసేవాడు అదే పార్టీ కౌన్సిలర్‌కు, కౌన్సిలర్‌కు వేసేవాడు అదే పార్టీ ఛైర్మన్‌కు ఓటు వేస్తాడు తప్ప రెండింటినీ వేరుగా చూసి విచక్షణ పాటించలేరు. అధికభాగం కౌన్సిలర్లను గెల్పించుకోగల్గిన పరిస్థితిలో వున్న కాంగ్రెస్‌కు ఇది అనుకూల పరిణామం.

మాగుంట, కె.వి. వర్గం వివేకాతో కలసి ప్రచారానికి తిరుగుతున్నా, వారి అనుచరుల నుంచి ఆ సహకారం అందడం లేదు. అక్కడక్కడా స్వతంత్ర అభ్యర్థులుగా వున్న వారి అనుచరులు ఛైర్మన్ ఓటు నైటికి వేయమని అడుగుతున్నారు.

ఇది వివేకాను చికాకు పెడుతున్నది. అయితే ఓటరు ఇప్పటికే ఒక నిర్ణయానికి వచ్చేసి వుంటాడు. అతనిలో మార్పు తెచ్చే సమయం దాటిపోయింది. పోలింగ్ రోజు నమ్మించి ఏజంట్లను నియమింప జేసి, బూతుల లోపల తెలుగుదేశంతో కుమ్మక్కయి విద్రోహానికి పాల్పడితే తప్ప వివేకా విజయం ఖాయమైనట్లే భావించాలి. అంత సమర్థత వారికి వుంటుందని భావించలేము.

మాజీ ఎమ్మెల్యే జకరెడ్డి గారు ఎందువల్లనో వివేకానందరెడ్డికి తాను ధర్మంగా చేయవలసిన ఉపకారం చేయలేక పోయారు. అపకారం చేశాడని ఆరోపించలేముకాని, పరోక్షంగా ఆయన ప్రవర్తన అట్లనే వుండింది. ప్రచారం సమయంలో టౌన్‌లో లేకుండా వెళ్లిపోయారు. 24వార్డులో ఆయన కుమారులు వ్యక్తిగత కక్షల పేరుతో కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా విస్తృతంగా ప్రచారం చేశారు. ధనవ్యయం చేశారు. ఇది అవకాశంగా తీసుకుని ఆయన అనుచరులు దర్గామిట్ట ప్రాంతమంతా నైటి నాయుడుకు మద్దతు పల్కుతున్నారు. జకరెడ్డి గారు నిరోధించి తీరి వుండవలసిన విద్రోహ చర్య ఇది. ప్రత్యక్షంగా తన ప్రమేయం లేకపోయినా పరోక్షంగా బాధ్యత ఆయనదే!

వార్డుల విషయానికి వస్తే వివరంగా చర్చించుకునే వ్యవధి, స్థలం లేవు.

6, 7, 9, 11, 12, 13, 18, 20, 21, 23, 24, 28, 32, 33, 34, 38, 42 వార్డులలో అంటే 17 వార్డులలో కాంగ్రెస్ అభ్యర్థుల గెలుపు ఖాయం.

1, 2, 3, 5, 8, 15, 19, 22, 26, 35, 43- చోట్ల తెలుగుదేశం విజయవకాశాలు మెండుగా వున్నాయి. తక్కిన చోట్ల పోటీ తీవ్రంగా వుంది. ఈ లెక్కన చూసినా కాంగ్రెస్‌దే పైచెయి.

ఎన్నికలలో అందరి దృష్టిని ఆకర్షిస్తున్న వార్డులలో 24 వార్డు మొదటిది. ఇక్కడ కెవి రాఘవరెడ్డిని ఓడించడానికి జకరెడ్డి కుటుంబం యావత్తు తన ప్రతిష్టను వనరులను ఫణంగా పెట్టి పోరాడుతున్నది. కాని వారి అభ్యర్థి కనీసం రెండవ స్థానంలోకి వస్తాడన్న నమ్మకమూ లేదు. డిపాజిట్ దక్కించుకోగల్గితే పరువు నిల్చినట్లే.

28 వార్డులో చాట్ల నరసింహారావు ఓటమికి మాగుంట అనుచరులు తీవ్రంగా కృషి చేస్తున్నారు కాని వ్యర్థం. 33 వార్డులో పసుపులేటి విజయ కుమార్‌కు పోటీ అన్నదే లేదు. టౌన్‌లో అత్యధిక మెజారిటీ - ఓట్ల శాతం దృష్ట్యా చూస్తే- విజయకుమార్‌దే అవుతుంది.

తెలుగుదేశానికి సంబంధించి 4వార్డు ప్రతిష్టాకరమైనది. ఈ ఒక్క వార్డు విషయంలోనే నైటి నాయుడు, రమేష్‌రెడ్డిల మధ్య కౌన్సిల్ టిక్కెట్ల విషయంలో పంతాలు పట్టింపులు పెరిగాయి. ఇప్పుడు విద్రోహాలూ వున్నాయి. కానీ తెలుగు దేశానికే ఛాన్సు ఎక్కువగా వుంది. 15 వార్డులో కెవిఆర్ కుటుంబ సభ్యుడు శ్రీనివాసులు రెడ్డి కాంగ్రెస్ తరపున పోటీ చేస్తున్నాడు. సాధారణంగా కౌన్సిల్‌లో ముగ్గురు నలుగురుగా వుండే కెవిఆర్ కుటుంబ సభ్యులు ఈసారి ఒక్కడితో సరిపెట్టుకున్నారు. వారి దురదృష్టం సిపిఎం ఉన్నవ బసవయ్య నుంచి పోటీ ఎదుర్కోవలసి వచ్చింది. గెలుపు అనుమానమే.

## గూడూరు

(8 వ పేజీ కొరవ)

లో సిపిఎం ప్రమీలమ్మ, వేమారెడ్డి - రామమ్మ పోటీ పడుతున్నారు. కాంగ్రెస్‌కు ఛాన్సులు లేవు. 20 వార్డులో సిపిఎం చంద్రయ్య గెల్చినట్లే భావించాలి. 21లో దేశం ప్రకాశం, కాంగ్రెస్ చింతల రవీంద్రల మధ్య పోటీ. గెలుపు ఊహించడం సాధ్యం కావడం లేదు. 22లో సిపిఎం రమణయ్య గెలవాల్సింది ; కాని, వేమారెడ్డి - వెంకట రమణయ్య గౌడ్ కులస్థుల అండతో డబ్బు వెదజల్లడం ద్వారా బాగా ముందుకు వచ్చాడు. 23 వార్డులో దేశం నాగేశ్వరరావు, వైశ్య కులస్థులలోని అలుకను తీర్చితే గెలుస్తాడు. కాంగ్రెస్ సురేష్ బాబుకు ఛాన్సు లేదు.

24 వార్డులో దేశం-లక్ష్మీ మదన్‌మోహన్‌కు డాక్టరు సిఆర్ రెడ్డిగారు స్వయంగా ప్రచారం చేస్తున్నారు. కాంగ్రెస్ సుబ్బరామమ్మ గట్టి పోటీ ఇస్తున్నప్పటికీ కష్టమే. 25 వారులో దేశం రమణమ్మ వీక్; కాంగ్రెస్ రాజేశ్వరమ్మ, వేమారెడ్డి- నిర్మల జ్యోతిల మధ్య పోటీ. 26లో కాంగ్రెస్ రమణయ్య బలహీనుడు. వేమారెడ్డి - సలీమ్ బెటర్‌గా వున్నాడు. 27 లో కాంగ్రెస్ పోటీలోలేదు. దేశం కిరణ్ కుమార్ విజయం నిర్ణయమై పోయిన విజం. 28లోనూ దేశం శివకుమార్ గెలుస్తాడు.

వార్డులవారీ సమీక్షిస్తే తెలుగుదేశం గెలుపు అంత సులభం కాదన్పిస్తున్నది కాని, ఛైర్మన్ విషయంలో వాతావరణం చూస్తే మాత్రం వారి గెలుపులో సందేహం కలడం లేదు.

## ఎన్టీఆర్

మొదటి పేజీ కొరవ

గల్గుతుంది. ఖమ్మంలో సిపిఐ, సిపిఎంలతో చేతులు కల్పితే కాని తెలుగుదేశం మెజారిటీ సాధించలేని పరిస్థితి వచ్చింది.

మండల ప్రాదేశికాలను చూస్తే, కరీంనగర్, ఖమ్మం, నల్గొండ, నిజామాబాద్ జిల్లాలలో కాంగ్రెస్ ఆధిక్యత సాధించింది. తెలుగుదేశానికి బలీయమైన కోట అనదగిన తూర్పు గోదావరి జిల్లాలో కాంగ్రెస్, తెలుగుదేశంతో ఇంచు మించు సరి సమానంగా సీట్లు పొంద గల్గింది.

మూడు నెలల లోపల జనంలో ఇంత మార్పు ఎందుకు వచ్చిందో అర్థం కాక నాయకులు తలలు పట్టుకుంటున్నారు. అప్పటికీ, కాంగ్రెస్ నాయకులు ఓటమి తప్పదన్న నిరుత్సాహంతో చాలా చోట్ల సరైన అభ్యర్థులను నిలబెట్ట లేదు. ప్రచారం చేయలేదు. పలువురు మాజీ మంత్రులు హైదరాబాదు వదలి జిల్లాలకే వెళ్లలేదు. కాంగ్రెస్ వాదులు ఉత్సాహంతో పనిచేసి గట్టి పోటీ ఇచ్చి వుంటే కనీసం పది జిల్లా పరిషత్‌లైనా హస్తగతమై వుండేవన్న వాస్తవం వారికి మ్రింగుడు పడడం లేదు.

రేషన్ కార్డులు తగ్గించి వేయనున్నారన్న భయం గ్రామీణ ఓటర్లలో మార్పు తెచ్చిందని; లక్ష్మీపార్వతి మితిమీరిన రాజకీయ జోక్యం వారిలో తెలుగుదేశం పట్ల విహ్యభావం కల్గించి వుండవచ్చునని పరిశీలకులు భావిస్తున్నారు. ఈ పరిస్థితులలో రాష్ట్రం వదలి పెట్టి ఎన్‌టి రామారావుగారు జాతీయ రాజకీయాలలో తలదూర్చితే పార్లమెంట్ ఎన్నికల నాటికి కాంగ్రెస్ తిరిగి సమస్థాయిలో పుంజు కొంటుందన్న భయం తెలుగు నాయకులలో స్పష్టంగా వ్యక్తమౌతున్నది. జాతీయ రాజకీయాల విషయంలో తొందర పడవలదని, పునరాలోచన చేయమని వారు ఎన్‌టిఆర్‌కు సలహా ఇస్తున్నారు.

ఈ పరిణామం చంద్రబాబు నాయుడాదులను సంతోష పెట్టిందనే చెప్పాలి. మితిమీరిన విజయ గర్వంతో ఎన్టీఆర్ తమను విస్మరించి, లక్ష్మీపార్వతి చేతికి పగ్గాలు పట్టించి ఢిల్లీకి వెళ్లిపోతారేమో నన్న సందేహం వారిలో వుండింది. ఈ చేదు ఫలితాల తర్వాత ఆయనలో మార్పు వస్తుందని, తమకు విలువ పెరుగు తుందని వారు ఆశిస్తున్నారు.

## బడ్జెటు

2 పేజీ కొరవ

ఇందులో 9 శాతం వాటా వుంది. బడ్జెట్‌లో పిక్చర్ ట్యూబుల పైన పన్ను తగ్గించినందువల్ల ఈ కంపెనీ లాభాలు విశేషంగా పెరుగుతాయి. పన్ను తగ్గింపు ఒకేసారి 15శాతం కావడంతో వీరి పం॰ పండినట్లే లెక్క. కంపెనీ లాభాలు పెరిగితే ఇపిఎస్ రు10 లు మించి పోతుంది. షేర్లు కొనదల్చిన వారు నమ్మకంగా కొనుక్కో దగిన షేరు ఇది.

## మండలాలు

(8వ పేజీ కొరవ)

కున్నాడు. లేకుంటే వెంకటాచలం, ఇందుకూరుపేట కూడా గెలవాల్సింది. కొద్ది తేడాలో పోయాయవి.

గూడూరు డివిజన్‌లో వాకాడును గెల్పించి తెలుగుదేశం నాయకులను తత్తర పెట్టాడు జనార్ధన రెడ్డి. మాగుంట సుబ్బరామ రెడ్డి గారు మాత్రం తన నియోజక వర్గ పరిధిలోని పది మండలాలలో కేవలం రెండింటిని - దుత్తలూరు, కలిగిరి; జిప్రప స్థానాల ఒకే ఒక్క కలిగిరిని గెల్పించుకో గల్గారు. ఇది ఆయనకు ఖేదం కల్గించే ఓటమి.

తెలుగుదేశానికి సంబంధించి మంత్రి ప్రసన్నకుమార రెడ్డి గారికి తీరని అవమానం కల్గించాయి ఈ ఎన్నికలు. ప్రతిష్టాకరంగా పోరాడిన స్వంత గ్రామం వూనుగుంట పాళెంలో తమ్ముడు జగన్మోహన రెడ్డి చేతిలో ఓటమి చవిచూశారు. వాకాడు జి.ప్ర.ప కోల్పోయాడు. చిల్లకూరు మండలం చేజారింది. చిట్టమూరులో పట్టు సడలింది. కోవూరు, కొడవలూరు మండల వార్డులలో తిరుగుబాటు అభ్యర్థులు గెల్చి పరువు తీశారు. కోవూరు శాసన సభ నియోజక వర్గ పరిధిలో చేరిన బుచ్చి మండలంలోని 7 వార్డులలో తెలుగుదేశం ఓడిపోయింది.

వేమారెడ్డి రామచంద్రా రెడ్డి గారిది మరీ అవమానం - వరగలి రాజ్యంలో ఒక్క తన స్వంత వూరైన వరగలిని తప్ప మరెక్కడా గెలవలేక పోయారు. స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుంచి రిగ్గింగ్ జరిపిస్తుండిన తమ్మిన పట్నంలో ఓడిపోయారు. తన స్వంత చిల్లకూరు మండలం చేజారింది. మామతో విభేదించి వెళ్లిన జానకి రామరెడ్డి, వేమారెడ్డి వెంకట కృష్ణారెడ్డి యువ ద్వయం వరగలి సామ్రాజ్యంలో విప్లవ విజయం సాధించారు. వరగలి ఓటర్లకు తొలిసారిగా వారి పుణ్యం వల్లనే రిగ్గింగ్ శాపం నుపం నుంచి విముక్తి కల్గి స్వేచ్ఛగా ఓటు వేయగల్గారు. కాంగ్రెస్‌లోని ప్రతి కార్యకర్తా వారిద్దరినీ అభినందిస్తున్నారు.

## సమర్థనీయమా?

2 పేజీ కొరవ

అందులోనూ ఈ హోటల్ నిర్మాణం ఇప్పుడే మొదలైంది. పూర్తయి, వ్యాపారం ప్రారంభించే నాటికి రెండేళ్ళు పడుతుంది. అప్పటి వరకు 18 శాతం వడ్డీ లెక్క కట్టినా షేరు మీద పెట్టుబడి విలువ రు 185 లు అవుతుంది.

పైగా మద్రాసులో ఫైవ్ స్టార్ హోటల్స్ ఆక్యుపెన్సీ రేటు తక్కువ. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన బొంబాయిలోనే ఇది సరాసరి 70 శాతంగా వుంటున్నది. మద్రాసులో 50 శాతానికి మించదు. మద్రాసు నగరం టూరిజానికి కూడా ఇంకా ప్రాముఖ్యత సంతరించు కోలేదు.

హోటల్ పరిశ్రమ మంచిదే. కాని ఇంత ప్రీమియంతో షేర్లు కొనడం వల్ల లాభనష్టాలు ఏమిటో ఆలోచించుకొని నిర్ణయం తీసుకోవడం మంచిది.

# శివారెడ్డి పద్యాలు

### కాంగ్రేసుపార్టి

ఎంతకాలమైందో, ఎవారు పుట్టించిరో!
కాంగిరేసుపార్టి కల్పతరువు
ఇందియా ప్రతిష్ఠకిది గొప్పతార్కాణము
ఇంతకంటె సాక్ష్య యేరిబల్లి!

పలురకాలు ఎన్నోపార్టీలు ఒకటయ్యి
కత్తి దూసినాయి కాంగ్రెసుపై
ఓడు గెలుపు రీంతా ఒరిగేది ఏమిటి!
మూడు దినాల భోగం, మురిసి పోకు.

మంత్రులెందరమంది
మటుమాయమయ్యారో
రాజులెంతమంది రాలిపోయ్యారో
పరుగులెత్తు తావు పడతావుకాల్జారి
ప్రాకులాడబోకు పదవి కొఱకు.

## వెంకటగిరి

6 పేజీ తరువ

శిరస్సును గుర్తుపట్టి తీసుకవచ్చి దానితో సహగమనం చేసింది. జనశ్రుతి ప్రకారం తిక్కన ఎక్కిన పంచ కల్యాణి గుఱ్ఱం ఆ వీరుని శిరస్సును నోటితో కరచుకొని ఇంటికి వచ్చినట్లు చెబుతారు.

కాటమ రాజా కథ గురించి చరిత్రకారులలో భిన్నాభిప్రాయాలున్నాయి. కొందరు కేవలం కల్పిత గాథగానే దానిని చూస్తె, మరికొందరు ఈ మధ్య కాలంలో లభించిన శాసనాధారం వల్ల ఆ కాలం నాటి అన్ని ముఖ్య గ్రంథాలలో ఖడ్గతిక్కనకు సంబంధించిన ప్రస్తావన ఉండడం వల్ల దీనిని చారిత్రకాంశంగానే భావిస్తున్నారు.

వెంకటగిరిని ముఖ్య కేంద్రంగా నెల్లూరు జిల్లాలో ఎక్కువ భాగాన్ని పాలించిన రాజవంశ స్త్రీలు పలువురు 'సతి' జరిపిన వివరాలు మనకు తెలుస్తున్నాయి.

### వీరమాతల దేవాలయం

వెంకటగిరి రాజులలో ప్రముఖుడైన బంగారు యాచమ నాయకుడు చనిపోయిన తర్వాత అతని భార్యలు పాపలమ్మ, అక్కమాంబలు ఇరువురూ సహగమనం జరిపారు. వీరుగాక వెంకటగిరి రాజ వంశంలో చాలా మంది సహగమనం జరిపినట్లు ఆధారాలున్నాయి.

### మల్లమ్మ దేవాలయం

వెంకటగిరిలో ఎన్నాబత్తుల కుటుంబానికి చెందిన మల్లమ్మ తనభర్త రంగయ్య చనిపోయిన తర్వాత అతని కొరకు పేర్చిన చితిమీదనే ఆహుతి అయ్యింది.

గూడూరు పట్టణంలో దాదాపు 200 సం.లు క్రితం ఇద్దరు సహగమనం జరిపినట్లు ఆధారాలున్నాయి.

### నల జారమ్మ దేవాలయం

గూడూరు పట్టణంలో దాదాపు 200 సం.ల క్రితం నల జారమ్మ అనే స్త్రీ తన భర్త పెంచల రెడ్డి మరణించిన పిదప సహగమనం జరిపింది. ఈ విషయంపై కవికోకిల శ్రీ దువ్వూరు రామిరెడ్డి గారు "నల్ల జారమ్మ అగ్నిప్రవేశం" అనే దివ్య కావ్యాన్ని 1917లో ప్రచురించారు.

### నారాయణమ్మ దేవాలయం

గూడూరులోనే మరొక పేరంటాలమ్మ దేవాలయం వుంది. అక్కడ నారాయణమ్మ అనే స్త్రీ తన భర్త శవంతోపాటు అగ్ని ప్రవేశం చేసిందని గ్రామస్థులు చెబుతున్నారు. ఆమెపేరు మీదుగా ఈ నారాయణమ్మ దేవాలయం నిర్మించారు. ఈ విషయంపై శ్రీ ముదివర్తి కొండమాచార్యుల వారు ఒక ఖండ కావ్యాన్ని వ్రాశారు.

### అల్లూరుపేట పేరంటాలమ్మ దేవాలయం

అల్లూరులో 1730 సం.లో ఎరబోలు వారి ఆడపడుచు, పొణకా వారి కోడలు అయిన స్త్రీ తన భర్త మరణానంతరం సహగమనం చేయాలని సంకల్పించింది. అందుకు బ్రిటీష్ అధికారులు ఒప్పుకోక వైస్రాయి గారి అనుమతి ఉంటె తప్ప వీలుకాదని చెప్పారు. ఆమె కలెక్టర్ ద్వారా వైస్రాయి గారికి నివేదించుకున్నది. 21రోజులకు వైస్రాయి గారు అనుమతి ఇచ్చారు. అప్పుడు గ్రామంలో ఉత్సవాలు జరిపి, ముత్తైదువులకు పసుపు కుంకుమ పంచి హోమ గుండంలో దూకింది. ఆమె పేరున వారి కుటుంబం అల్లూరు పేటలో పేరంటాలమ్మ దేవాలయం కట్టించారు. అది ఇప్పటికీ అక్కడే వున్నది. అందులో పార్వతి అమ్మవారి విగ్రహం వున్నది.

### కల్లూరు గ్రామం

ఈ గ్రామం సూళ్లూరుపేట తాలూకాలో వున్నది. ఇక్కడ వీరాలయ్య, వీరాలమ్మ అనే దంపతుల రాతి విగ్రహాలు చెక్కి వున్నాయి. ఈ విగ్రహాలు సతీ సహగమన చిహ్నాలని గ్రామస్థులు చెబుతున్నారు. వీరివురూ ఆ గ్రామం మీదుగా వేరే గ్రామానికి పోతూ చెరువువద్ద విశ్రమించారు. అంతలో ఒక పాము వారి కంట బడింది. వీరాలయ్య దానిని వెంబడించాడు. అది ఒక కలుగులోకి పోయింది. అదిరాకుండా వుండేటందుకు గాను ఒక రాయి అడ్డు పెట్టాడు. వారు వెళ్లాల్సిన గ్రామం వెళ్ళిపోయారు. కొద్ది రోజుల తర్వాత తమ తిరుగు ప్రయాణంలో వారు ఆ చెరువు గట్టువద్దనే విశ్రాంతి తీసుకోవడం జరిగింది. పాము సంగతి గుర్తుకు వచ్చిన వీరాలయ్య తాను రాయి అడ్డుపెట్టిన కలుగు వద్దకు వెళ్లి రాయితీశాడు. ఆ పాము అమిత వేగంతో వచ్చి వీరాలయ్యను కాటువేసింది. అక్కడికక్కడే ప్రాణాలు వదిలాడు వీరాలయ్య. భర్త మరణం చూసిన వీరాలమ్మ తానూ అక్కడికక్కడే చితిపేర్చుకుని మంటలలో దూకింది. వారిపేరు మీద చెక్కబడిన రాతి విగ్రహాలు వీరాలయ్య, వీరాలమ్మ అనే పేరుతో ఇప్పటికీ పిలువ బడుతూనే వున్నాయి.

నెల్లూరు పట్టణంలో రంగనాయకుల పేటలోని వెంకటమ్మ విగ్రహం దేవాలయంలో సతీ సహగమనం చేసిన స్త్రీదేనని చెబుతారు. అయితే దీనికి సంబంధించిన వివరాలు తెలియలేదు.

(కొరవ పైవారం)

## 50 ఏళ్ల క్రితం

3 వ పేజీ కొరవ

టర్కీలో కూరగాయలు కంట్రోలు చేసిన తర్వాత పుచ్చిపోయిన సరుకు జాస్తిగా వస్తున్నది. హెల్త్‌శాఖ "అలవైకుంఠపురంబులో- నగరిలో- ఆ మూల బస్స్టాండుకావల" నే వుంటున్నదా?

ఇచ్చట * *పదార్థాలు నేతితో చేయబడును గ్యారంటీ నెయ్యి అని నమ్మకంగా చెప్పలేము". ఈ పరసన కాఫీ, భోజన హోటళ్లలో బోర్డులు వేయించారే! ఇది ఆరోగ్య రక్షణకు ఎట్లా ఉపకరిస్తుందో వివరించుతారా హెల్తుగారూ?

### నీటి మట్టం

| | |
|---|---|
| కలిగిరి రిజర్వాయరు | 17.9అ |
| సర్వేపల్లి రిజర్వాయరు | 7.8అ(13తేది) |
| నెల్లూరు చెరవు | 15.6అ |

### నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలుకులు | |
| 9672 క్రొత్తవి | 4,400/- |
| 9672 పాతవి | 3,400/- |
| 9674 క్రొత్తవి | 3,600/- |
| ఐ.ఆర్.20 | 3,300/- |
| T. 145 | 3,400/- |
| మొలగొలుకులు బియ్యం | 650/- |
| బంగారు సవర(8గ్రా) | 3,560/- |
| వెండి 10గ్రా | 68/- |

### పంచాంగం

#### ముహూర్తములు

19తేది ఆదివారం ఉ.గం.9.54లకు వృషభ లగ్నమున ఉపనయన, వివాహ, వ్యాపారములకు సుముహూర్తమున్నది.

#### మార్చి తిథులు

ఫాల్గుణ బహుళ
తే 18 శని విదియ రా.గం.4.15వ
తే 19 ఆది తదియ రా.గం .2.21వ
తే 20 సోమ చతుర్థి రా.గం.12.14వ
తే 21 మంగళ పంచమిరా.గం.9.57వ
తే 22 బుధ షష్ఠి రా.గం.7.37 వ
తే 23 గురు సప్తమి సా.గం. 5.11వ
తే 24 శుక్ర అష్టమి సా.గం. 2.50వ

స్వయంపాకుల శ్రీనివాసులు యం.ఎ.,

# గెల్చిన వాటిలోనూ దేశం మెజారిటీలు స్వల్పమే!

జిల్లాలోని 46 జిల్లా పరిషత్ ప్రాదేశిక నియోజక వర్గాల్లో 45లకు మాత్రమే ఎన్నికలు జరిగాయి. వీటిలో తెలుగుదేశం పార్టీ 30 జడ్పీ నియోజక వర్గాలలో గెలుపొందగా, కాంగ్రెస్ పార్టీ 15 స్థానాల్లో నెగ్గి తన సత్తా చాటింది. దక్కిలిలో కాంగ్రెస్ అభ్యర్థి హత్య కారణంగా ఎన్నికను నిలిపేశారు. ఈ ఎన్నికల్లో పోటీ చేసిన సిపిఎం, బిజెపి పార్టీలు ఒక్క స్థానాన్ని కూడా పొందలేక పోయాయి. నియోజక వర్గాల వారీగా గెలుపొందిన వారు, పొందిన ఓట్లు దిగువ ఇస్తున్నాం. తెలుగుదేశం పార్టీ పలు స్థానాల్లో ఓడి పోవడమే కాదు, గత శాసన సభ ఎన్నికలతో పోల్చి చూస్తే ఆ పార్టీ గెల్చిన స్థానాలలోనూ మెజారిటీలు స్వల్పంగా వున్నాయి.

**నెల్లూరు రూరల్**

వేమిరెడ్డి హంసకుమార్ రెడ్డి (కాం)- 20, 151; బి.వి. రమణారెడ్డి (సి.పి.ఎం)18,916; మెజార్టీ : 1235;

**వరికుంటపాడు**

బి. సుబ్బమ్మ (తె.దే)-7, 382; వై. కొండమ్మ (కాం) - 7,296 మెజార్టీ : 86;

**వింజమూరు**

జి. సుజాత (దేశం)- 15,377; వరలక్ష్మమ్మ (కాం)- 13,257; మెజార్టీ : 2,120

**జలదంకి**

వై. శ్రీనివాసరావు (తె.దే)- 11, 888; కె. సుబ్బయ్య (కాం)- 10,408; మెజార్టీ : 1480

**కోవూరు**

పి. ప్రమీలమ్మ (తె.దే)- 13,569; సి.హెచ్.సుశీలమ్మ (కాం)- 11, 286; మెజార్టీ : 2, 283

**సీతారామపురం**

సి.హెచ్. లక్ష్మీకాంతమ్మ (తె.దే)- 5,874; ఎ. వెంకటలక్ష్మమ్మ(కాం)- 5,061; మెజార్టీ: 813.

**తోటపల్లి గూడూరు**

కె. రవీంద్ర రెడ్డి _ (తె.దే)- 12,347; జి. శివకుమార్ రెడ్డి (కాం)- 9,559; మెజార్టీ : 2788

**కావలి**

ఎస్. రామ్‌ప్రసాద్ (తె.దే)- 14, 105; జె. రాఘవులు (కాం)- 11, 702; మెజార్టీ : 2,403.

**కొడవలూరు**

పి. సరోజనమ్మ (తె.దే)- 12,304; ఆర్. బుజ్జమ్మ (కాం)- 7,248; మెజార్టీ : 5,056.

**విడవలూరు**

టి. లక్ష్మయ్య (తె.దే)- 11,856; సి.హెచ్.చిన్న వెంకయ్య (కాం)- 7,721; మెజార్టీ : 4155

**దగదర్తి**

ఎం. రామానాయుడు (తె.దే)- 10, 248; టి. రమణయ్య నాయుడు (కాం)- 9,644; మెజార్టీ : 604.

**బుచ్చిరెడ్డిపాళెం**

వై. శివరామకృష్ణారెడ్డి (కాం)- 16,287; బి. గోవర్ధనరెడ్డి (తె.దే)- 15,615; మెజార్టీ : 1672.

**సంగం**

జి. వెంగమ్మ (తె.దే)- 10,066; సి.హెచ్. రమణమ్మ (కాం)- 9,182,మెజార్టీ 884.

**ఉదయగిరి**

ఎం. వెంకట రెడ్డి(తె.దే)- విజేత

**దుత్తలూరు**

సి.హెచ్. మాధవి (తె.దే)- 6,133; ఎం. అన్నపూర్ణమ్మ (కాం)- 5,362; మెజార్టీ: 771.

**మర్రిపాడు**

ఎన్. రత్నమ్మ (తె.దే)- 11,791; వి. విజయలక్ష్మి (కాం)- 7,134; మెజార్టీ : 4,457.

**కలిగిరి**

సి.హెచ్. చిన్నమాలకొండయ్య (కాం)- 10,906; సి.హెచ్. మాలకొండయ్య (తె.దే)- 10,347; మెజార్టీ : 561.

**ఎ.ఎస్.పేట**

పి. సుబ్బారెడ్డి (తె.దే)- 10,301; ఎం. వెంకటరెడ్డి (కాం)- 4,736; మెజార్టీ: 5,565.

**అనంతసాగరం**

బి. లీలావతి(కాం)- 10,491; ఎ. పద్మజ (తె.దే)- 6,858; మెజార్టీ: 3,633.

**ఇందుకూరు పేట**

డి. శివకుమార్ రెడ్డి (తె.దే)- 11,308; జి. సురేష్ రెడ్డి(కాం)- 10,272; మెజార్టీ: 1126.

**ఆత్మకూరు**

సి.హెచ్. ఆదిశేషయ్య (కాం)- 14,398; ఎల్. వెంకట రమణయ్య (తె.దే)- 11,035; మెజార్టీ: 3,363.

**అల్లూరు**

సి.హెచ్. సుబ్బయ్య (కాం)-13, 194; టి. వెంకటరత్నం (తె.దే)- 11,855; మెజార్టీ: 2,339.

**బోగోలు**

ఎమ్. వరలక్ష్మి (కాం)- విజేత; మెజార్టీ: 2428.

**కలువాయి**

పి. వెంకటరత్నం (కాం)- విజేత

**ముత్తుకూరు**

ఎమ్. రవికుమార్ రెడ్డి (తె.దే)- 12,783; వి. శేషాద్రి రెడ్డి (కాం)- 9,559; మెజార్టీ: 3,224.

**కొండాపురం**

జి. వరలక్ష్మమ్మ (తె.దే)- మెజార్టీ: 9,103.

**వెంకటాచలం**

ఉమ్మా చంద్రయ్య (తె.దే)- మెజార్టీ: 1650.

**పొదలకూరు**

నువ్వుల వెంకట సత్యనారాయణ నాయుడు(తె.దే)- మెజార్టీ: 5047.

**చేజర్ల**

కె. ప్రమీలాదేవి(తె.దే)- మెజార్టీ: 8739.

**రాపూరు**

ఎం. మురళీధర్ (కాం)- మెజార్టీ: 4070.

**సైదాపురం**

ఎన్. కౌసల్యమ్మ (తె.దే)- మెజార్టీ: 420.

**గూడూరు**

ఎన్. రామమోహన్ (తె.దే)- మెజార్టీ : 4061.

**మనుబోలు**

ఎం. నాగభూషణమ్మ (తె.దే)- 9,724; కె. రమణమ్మ- 5,731; మెజార్టీ: 3026.

**కోట**

అవిశ పోలయ్య(తె.దే)- విజేత.

**చిల్లకూరు**

పి. రామచంద్రయ్య (తె.దే)- మెజార్టీ : 4,337.

**వాకాడు**

పి. రమణమ్మ(కాం)- విజేత.

**చిట్టమూరు**

బి. చిన్నారావు (తె.దే)- మెజార్టీ: 573

**నాయుడుపేట**

ఎం.వి. రాఘవరెడ్డి(తె.దే)- మెజార్టీ: 6703.

**పెళ్లకూరు**

టి. చిన్నరాఘవులు (తె.దే)- మెజార్టీ: 249.

**ఓజిలి**

ఎన్. సెల్వరాజ్(కాం)- మెజార్టీ: 716.

**సూళ్లూరుపేట**

ఎం. సిద్ధమ్మ (తె.దే)- 13,369 రాజసులోచనమ్మ కాంగ్రెస్ - మెజార్టీ: 434.

**దొరవారి సత్రం**

ఎ. వెంకట రమణమ్మ (కాం)- మెజార్టీ: 219.

**తడ**

యు. సుబ్రహ్మణ్య రెడ్డి (కాం)- మెజార్టీ : 2019.

**వెంకటగిరి**

ఎన్. జయరామయ్య (కాం)- మెజార్టీ: 4530

**బాలాయపల్లి**

బి. వెంకట సుబ్బయ్య(కాం)- మెజార్టీ: 1123.

## మండల ప్రాదేశిక నియోజకవర్గాల్లో విజేతలు

జిల్లాలోని 553 మండల ప్రాదేశిక నియోజక వర్గాల్లో 530 స్థానాల్లో మాత్రమే ఎన్నికలు జరిగాయి. హై కోర్టు వుత్తర్వు వల్ల అనంతసాగరం మండలంలోని 11 ఎం.పి.టి.సి.లకు ఎన్నికలు జరగలేదు. మరో 12 టి.సి.ల్లో అభ్యర్థులు ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. ఎన్నికలు జరిగిన మొత్తం టి.సి.ల్లో తెలుగుదేశం 269 స్థానాలు, కాంగ్రెస్ 215, సిపిఎం 20, సిపిఐ 4, బిజెపి 3, ఇండిపెండెంట్లు 31 చోట్ల విజయం సాధించారు. మండలాల వారీగా వివరాలు దిగువ ఇస్తున్నాము.

| మండలం | ప్రాదేశికాల సంఖ్య | తెలుగు దేశం | కాంగ్రెస్ | సిపిఎం | సిపిఐ | బిజెపి | ఇండిపెండెంట్లు |
|---|---|---|---|---|---|---|---|
| సీతారామపురం | 6 | 6 | | | | | |
| ఉదయగిరి | 9 | 6 | 3 | | | | |
| వరికుంటపాడు | 8 | 3 | 4 | 1 | | | |
| దుత్తలూరు | 7 | 2 | 5 | | | | |
| మర్రిపాడు | 11 | 8 | 2 | 1 | | | |
| వింజమూరు | 9 | 7 | 1 | | | | 1 |
| కలిగిరి | 11 | 5 | 6 | | | | |
| కొండాపురం | 10 | 6 | 1 | | | | 3 |
| కావలి | 15 | 9 | 5 | | | | 1 |
| జలదంకి | 11 | 8 | 3 | | | | |
| బోగోలు | 14 | 1 | 5 | 2 | | | 6 |
| కోవూరు | 19 | 7 | 4 | 1 | 2 | 1 | 4 |
| కొడవలూరు | 7 | 1 | 2 | | | | 2 |
| విడవలూరు | 12 | 9 | 1 | 1 | | | 1 |
| గూడూరు | 13 | 11 | 2 | | | | |
| మనుబోలు | 9 | 5 | 2 | 2 | | | |
| చిల్లకూరు | 12 | 5 | 7 | | | | |
| వాకాడు | 9 | 3 | 6 | | | | |
| కోట | 13 | 11 | 2 | | | | |
| చిట్టమూరు | 10 | 6 | 4 | | | | |
| నాయుడుపేట | 17 | 14 | 2 | | | | 1 |
| పెళ్లకూరు | 9 | 5 | 4 | | | | |
| ఓజిలి | 9 | 5 | 4 | | | | |
| సూళ్లూరుపేట | 16 | 11 | 5 | | | | |
| దొరవారిసత్రం | 9 | 3 | 5 | | | | 1 |
| తడ | 11 | 3 | 8 | | | | |
| వెంకటగిరి | 18 | 2 | 15 | | | | 1 |
| బాలాయపల్లి | 9 | 3 | 6 | | | | |
| దక్కిలి | 10 | 4 | 6 | | | | |
| దగదర్తి | 10 | 5 | 4 | | | | 1 |
| అల్లూరు | 14 | 4 | 9 | | | | 1 |
| బుచ్చిరెడ్డిపాళెం | 18 | 1 | 12 | 3 | | | 2 |
| సంగం | 11 | 4 | 6 | 1 | | | |
| ఆత్మకూరు | 15 | 5 | 8 | | | | 1 |
| ఎ.ఎస్.పేట | 9 | 5 | 1 | | | | 3 |
| అనంతసాగరం | | ఎన్నిక జరగలేదు | | | | | |
| ఇందుకూరుపేట | 15 | 9 | 4 | 1 | | 1 | |
| తోటపల్లిగూడూరు | 13 | 7 | 5 | 1 | | | |
| నెల్లూరు (రూరల్) | 22 | 8 | 8 | 4 | 1 | | 1 |
| వెంకటాచలం | 14 | 7 | 6 | | | | 1 |
| ముత్తుకూరు | 12 | 10 | 2 | | | | |
| పొదలకూరు | 16 | 11 | 3 | 1 | | | 1 |
| చేజర్ల | 9 | 7 | 2 | | | | |
| కలువాయి | 12 | 5 | 7 | | | | |
| రాపూరు | 12 | 1 | 11 | | | | |
| సైదాపురం | 12 | 6 | 6 | | | | |

# తెల్లబోడులో నాటు సారా జోరు!

సైదాపురం మండలం దాగణం గ్రామ సమీపంలోని తెల్లబోడు అడవుల్లో దొంగ సారాను యథేచ్ఛగా కాస్తున్నారు. నెల రోజులుగా ఈ తంతు కొనసాగుతున్నది. ఈ సారా కాసే వ్యవహారాన్ని అడవిలోకి వెళ్లి మేకలు, గొర్రెలు మేపుకొనే వారు చూసినా బయట పెడితే ఏ ప్రమాదం వస్తుందోనని పూరకుంటున్నారు. కడప జిల్లా వాసులు స్థానికుల సహాయంతో ఈ పని కానిస్తున్నారు. ఇక్కడ సారా తయారు చేయడం వల్ల సైదాపురం, రాపూరు, పొదలకూరు మార్కెట్‌లోని బెల్లాన్ని కొందరు టోకుగా కొని తీసుకొని వెళుతున్నా అన్ని వ్యవహారాలూ చూస్తూనే ఎక్సైజ్ శాఖ తనకేమి పట్టనట్లుంది. వెలుగొండ అడవుల్లో సారా స్థావరాలు బహిర్గతం కావడంతో వ్యాపారులు తెల్లబోడు అడవులను ప్రస్తుతం ఎంచుకొన్నారు.

## గూడూరు మునిసిపాలిటీ స్పెషాలిటీ!

రాష్ట్రంలోని మురికి మునిసిపాలిటీల జాబితాలో గూడూరుకు ఫస్ట్ ర్యాంక్ ఇవ్వవచ్చు. మునిసిపాలిటీ స్థాయికి తగ్గట్టు స్కావెంజర్లు వున్నా వీరు ప్రతిదినం పని చేయరు. నెలకో, రెండు నెలలకో మంత్రులు, ప్రముఖులు అధికారులు పట్టణానికి వస్తున్నట్లు తెలుసుకొని పనిలోకి వస్తారు. వీధుల్లో బ్లీచింగ్ పౌడర్ కుమ్మరించి నానా హంగామా చేస్తారు. మిగతా రోజుల్లో చెత్తంతా రోడ్ల పై పరచుకొని వుంటుంది. ఆర్టీసీ బస్టాండ్ నుండి వల్ల కాలువ వరకు ఒక సారి తిరిగితే టౌన్ ఎంత సుందర మురవన్నంగా వుందో అట్టే అర్థమై పోతుంది. ప్రధాన రహదారి ఈ గతిలో వుంటే సందులు గొందుల పరిస్థితి వర్ణించక్కర్లేదు. నిరంతరం వరహాల సమూహాలతో అలరారుతుంటాయి. రెండు నెలల కొక సారి వచ్చే సిబ్బంది పలుగు పారలు చేత బట్టి బయలు దేరుతారు. రోడ్డు ప్రక్కన వుండే ఆక్రమణ దారులు, ఇవి తమ కోసమేమోనని భయపడి పోతారు. తీరా పలుగు పారలతో చెత్త దిబ్బల్ని ఛేదించి సిబ్బంది వెళ్లిపోతారు. ఇక్కడి మునిసిపల్ కమీషనర్ బదలీ అయ్యారు. బదలీ ఎన్నికల వల్ల ఆగిపోవడంతో ఏ విషయంలోనూ ఆయన శ్రద్ధ చూపెంచడం లేదు. దీనితో గూడూరు మరింత గబ్బు పట్టి పోతున్నది.

## చదువులో గూడూరు ఘనత!

గూడూరు డి.ఆర్. డబ్ల్యు కళాశాల 14వ వార్షికోత్సవం ఇటీవల జరిగింది. వెంకటేశ్వర యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ రామమూర్తి ముఖ్య అతిథిగా పాల్గొని ప్రసంగించారు. జిల్లాలోని కళాశాల లన్నింటిలోను ఉత్తమ ఫలితాలు సాధిస్తున్న ఈ కళాశాల విద్యార్థినులను అభినందించారు. ప్రత్యేక ఆహ్వానితునిగా విచ్చేసిన జర్మనీ బాన్ విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ డాక్టర్ కెల్లర్ మాట్లాడుతూ భారత దేశస్థుల మేధా సంపత్తి ఇతర ప్రపంచ దేశాలకు ఏ మాత్రం తీసిపోదన్నారు. ఆయన చేతుల మీదుగా వివిధ పోటీల్లో గెలుపొందిన వారికి బహుమతులు పంచి పెట్టారు.

సభకు పారిశ్రామిక వేత్త అల్లారెడ్డి శ్యామ సుందర రెడ్డి అధ్యక్షత వహించగా డాక్టర్ సి.ఆర్. రెడ్డి ప్రిన్సిపల్ మెహరమతి వేదిక పై ఆశీనులయ్యారు.

## ఇనమడుగు కళాశాల వార్షికోత్సవం

ఇనమడుగు ప్రభుత్వ జూనియర్ కళాశాల 19వ వార్షికోత్సవం ప్రిన్సిపల్ డాక్టర్ శ్రీమతి రాజకుమారి అధ్యక్షతన జరిగింది. కోవూరు షుగర్ ఫ్యాక్టరీ ఛైర్మన్ జి. రాధాకృష్ణా రెడ్డి, వృత్తి విద్యాధికారి వి. రాజగోపాలరావు, కోవూరు ఆంధ్రా బ్యాంక్ మేనేజర్ ఎన్. ధనంజయుడు వేదికలో ఆశీనులయ్యారు. ప్రిన్సిపల్ వార్షిక నివేదికను సమర్పిస్తూ కళాశాల నూతన భవన సముదాయాలు సాధించేందుకు అమెరికాలో స్థిరపడ్డ ఇనమడుగు గ్రామస్తుడు పంగర రామకృష్ణ, జిల్లా కలెక్టర్ సూచన వదాన్యతను వివరించారు. ఆటల పోటీల్లో విజేతలకు కోవూరు ఎస్‌ఐ కొండా రెడ్డి బహుమతి ప్రదానం చేసారు. ఉత్తమ విద్యార్థి ఎం. శ్రీధర్‌ను వేదిక పై పెద్దలు పలు ప్రోత్సాహకాలిచ్చారు. సాంస్కృతిక కార్యక్రమాలు చక్కగా సాగాయి.

## జిల్లా వార్తలు

# అల్లూరు విష్ణు ఓటమి ప్రతీకారం తీరింది!

జిల్లా పరిషత్, మండల ప్రాదేశిక నియోజక వర్గాలకు జరిగిన ఎన్నికల్లో అల్లూరులో కాంగ్రెస్ జయ కేతనం ఎగురవేసింది. జడ్‌పిటిసి స్థానాన్ని పార్టీ అభ్యర్థి చలంచర్ల సుబ్బయ్య 2,329 ఓట్ల మెజారిటీతో గెల్చుకోగా, 14 మండల ప్రాదేశిక నియోజక వర్గాల్లో 9 ఆ పార్టీ పరమయ్యాయి. ఈ విజయం తాలూకు క్రెడిట్ అంతా విష్ణుదే. అభ్యర్థుల్లో పసలేక పోయినా కాటంరెడ్డి కుటుంబానికి అభిమానం క్రెడిట్, విష్ణు మొన్నటి ఎన్నికల్లో ఓడిపోయాడన్న సానుభూతి కాంగ్రెస్‌కు ప్లస్ పాయింట్లయ్యాయి. కాని విష్ణు మాటకు ఎదురే లేకుండా వుండిన పట్టపు పాలాలు ఈసారి ఆయనకు ఎదురు తిరిగాయి. జక్కా వెంకయ్య ఎమ్మెల్యే అయ్యాక సర్పంచ్ అశోక్ కుమార్ రెడ్డి అల్లూరు వరకు తానే ఎమ్మెల్యేనన్నట్లుగా వ్యవహరిస్తున్నాడు. దీనివల్ల ఎన్నికల రోజు జరిగిన గొడవలో విష్ణు - అశోక్‌లు ముఖాముఖి తలపడను సిద్ధమయ్యారు. ఈ ధోరణి ఇరు వర్గాలకూ మంచిది కాదు. అల్లూరులో వేళ్ల మీద లెక్కించ దగ్గ కామ్రేడులు తగుదునమ్మా నంటూ 3 స్థానాల్లో పోటీ చేసి పరాజయం పాలయ్యారు. నియోజక వర్గంలోని బుచ్చి, బోగోలు మండలాల్లో కాంగ్రెస్ పార్టీ విజయ పరంపర కొనసాగింది. కాని దగదర్తిలో తన ఆగర్భ శత్రువు మాలపాటి రామానాయుడు చేతిలో జిల్లా మార్కెటింగ్ సొసైటీ ఛైర్మన్ తాళ్లూరు రమణయ్య నాయుడు కాంగ్రెస్ తరఫున పోటీ చేసి ఓడి పోయారు.

## విడవలూరు డిగ్రీ కళాశాల త్రిదశ వార్షికోత్సవం!

విడవలూరు పి.ఆర్.ఆర్. మరియు పి.ఎన్. ప్రభుత్వ కళాశాల 30వ వార్షికోత్సవం ఇటీవల రెండు రోజుల పాటు ఘనంగా జరిగింది. తొలి రోజు జరిగిన క్రీడా దినోత్సవానికి కళాశాల అభివృద్ధి మండలి అధ్యక్షులు డాక్టర్ ఎ. బ్రహ్మానందం విచ్చేసి బహుమతు లందించారు. రెండో రోజు సభా కార్యక్రమానికి ప్రిన్సిపల్ కె.బి. జైకుమార్ అధ్యక్షత వహించారు. వక్తగా విచ్చేసిన ముత్తుకూరు మత్స్య కళాశాల ప్రిన్సిపల్ డాక్టర్ బాబూరావు మాట్లాడుతూ గ్రామీణ ప్రాంతాల్లోని డిగ్రీ కళాశాలలో వృత్తి విద్యా కోర్సులు ప్రవేశ పెట్టాలని; దీనివల్ల పేద విద్యార్థులు అభివృద్ధి సాధించ గలరన్నారు. పాలకవర్గ సభ్యులు పొన్నలూరు రామచంద్రా రెడ్డి, డాక్టర్ డివిఎస్ శాస్త్రి, వ్యాయామ ఉపాధ్యాయులు ఎం.వి. ఇమాన్యుల్ తదితరులు వేదిక నలంకరించారు.

# టైటిలే సినిమాలకు మొదటి హీరోనా?

ముందు టైటిల్ ప్రకటించి, ఆ తర్వాత ఆ టైటిల్‌కు తగినట్లు కథను మలచుకునే దాసరి సరికొత్త సృష్టి "స్వీట్‌హోమ్" జయసుధ సమర్పించే చిత్రమిది. ఆమె తప్పకుండా ఉంటుంది. ఇతర పాత్రలను ఎవరు ధరిస్తారో కథ పూర్తయ్యాక గాని తెలియదు.

టైటిలే చిత్రానికి మొదటి హీరో - అని ఇప్పటి దర్శక నిర్మాతల అభిప్రాయం. కథ ఏమిటో

## ముందు పేరు పెట్టుకొని, తర్వాత కథ వెతుకుతున్న దర్శక నిర్మాతలు

తెలియకుండానే అభిమాన సంఘాల వారు సూచించే టైటిల్స్‌ని పెడుతున్నారు కొందరు. వీటికి చిత్ర కథలతో సంబంధం లేకపోయినా ఎవరూ పట్టించుకోరని ఈ దర్శక నిర్మాతల అభిప్రాయం. ప్రేక్షకులను ఆకర్షించే, అభిమాన సంఘాలను ఆనందింపజేసే టైటిల్స్ కాదు కావలసింది; కథకు తగ్గ టైటిల్స్! ఈ విషయాన్ని ఎవరు తీవ్రంగా పట్టించుకుంటారు?

### "శ్రీవారి సన్నిధి"

" వేంకటేశ్వర స్వామిగా శోభన్‌బాబు నటించే చిత్రాన్ని ఆగష్టు 19న ప్రారంభిస్తాం " అన్నారు అప్పుడు " దొరబాబు" చిత్రాన్ని నిర్మిస్తున్న ఐ.వి.కె. మోహన్. ఆ చిత్రం పేరు "శ్రీవారి సన్నిధి".

### మమ్ముట్టి విసుగు

ఎ.వి.ఎం. స్టూడియోలో "మక్కళాట్చి" అనే తమిళ చిత్రం షూటింగ్ జరుగు తూంది. మమ్ముట్టికి తమిళంలో ఇచ్చిన డైలాగ్‌ను మలయాళంలో రాసుకుని కంఠతా పెట్టడం పూర్తయింది. తను 'రెడీ' అన్నా ఎవరూ పట్టించుకున్నట్లు లేదు. సెట్‌లో ఒక మూల నటి రోజా, ఆమెను మనువాడబోతున్న డైరెక్టర్ సెల్వమణి మెల్లగా మాట్లాడుకుంటూ నవ్వు కుంటున్నారు. రోజా చేతిని తన చేతుల్లోకి తీసుకున్న సెల్వమణి ఆప్యాయంగా మర్దనా చేస్తున్నారు. మమ్ముట్టి ముఖంలో కాస్త కోపం కనిపించింది. పక్కనున్న అసోసియేట్ డైరెక్టర్‌తో " నేను డైలాగ్‌లు కంఠతా పెట్టి ఎంత సేపైంది? డైరెక్టర్‌కి అసలు నేనొకడ్ని సెట్‌లో వున్న ధ్యాస అయినా లేదు. రజనీకాంతో, కమలహాసనో అయితే, ఆయన ఇంత నిర్లక్ష్యంగా ఉంటాడా? ఏమిటి ఆ వికవికలు, పకపకలు ఆమెతో; నాకు బుద్ధొచ్చింది. ఇటువైన తమిళ చిత్రాలే అక్కర్లేదన్నంత విరక్తి కలుగుతోంది అని ఆయన చిరాకు పడుతున్నా దర్శకుడు గమనించలేదు.

# చంద్రమోహన్ కథానాయకుడిగా చిత్రనిర్మాణం!

"ఏమిటి? ఈ వయసులో నేను హీరోగా ఒక చిత్రమా అని విస్తుపోకండి. కథ అటువంటిది. సమాజంలో స్త్రీలకు జరిగే అన్యాయాలను ఎదుర్కొంటూ చివరికి బలి అయ్యే పాత్ర నాది", అన్నారు చంద్రమోహన్. 'నవభారతనారి' చిత్రంలో గోకిన రామారావు, శ్రావణి,లత, స్నేహ, ఉమాశర్మ, బేబీ పవిత్ర, మొదలగు పాత్రధారులున్నారు. దర్శకత్వం : కె.ఎస్. ప్రసాద్.

## మద్రాసు సినిమా వార్తలు

### నమోదు చేయబడిన చిత్రాల పేర్లు

రత్నా ఆర్ట్ " ఆయనే నా మొగుడు"; సూరజ్ మూవీస్ " మా ఇద్దరి మొగుడు", శ్రీ సాయిరత్న ఇంటర్నేషనల్ " పెళ్ళానికి పెళ్లాం"; ఎ.కె. క్రియేషన్స్ " కోడలా మజాకా"; సుజాత ఆర్ట్ ప్రొడక్షన్స్ " భీష్మ" ; జనశక్తి ఫిలిమ్స్ "విప్లవ జ్యోతి"; శ్రీలక్ష్మి ప్రసన్న పిక్చర్స్ "కుబేరుడు"; కామాక్షి ఫిలిమ్స్ " పరమానందయ్యగారి పదిమంది శిష్యులు"; తిలక్‌రాజ్ ఫిమ్ లైన్ "ఆమె నచ్చింది"; సాయి చిత్ర " దొంగాట"; జాగృతి క్రియేషన్స్ "ఎర్రదళం"; రసరంజని ఆర్ట్స్ "కంచుకోట"; రత్న ఆర్ట్స్ "మరో

కొరవ 14 పేజీలో

# పత్రికల వాళ్ళే నాకు పెళ్లి జరిపించేస్తారా?

"కృష్ణతో మీకు ఒకే ఒక తెలుగు చిత్రం వున్నట్లుంది" అని ఒక తెలుగు సినిమా పత్రిక రిపోర్టర్ అడిగారు. అంతే, గౌతమి ఆగ్రహోదగ్రంతో " వచ్చిన ప్రతి చిత్రాన్నీ ఒప్పుకుంటే, నా అంత బిజీ ఆర్టిస్ట్ మరొకరుండరు" తెలుగులో మంచి కథలు ఎక్కడున్నాయండీ" అంటూ కాస్సేపాగి నాకు చిత్రాలు తక్కువయ్యాయి. గనుక పెళ్ళి ప్రయత్నంలో వున్నానని రాసేయండి. మీకివేగా సంచలన వార్తలు. ఇది చూసి మరో సినిమా పత్రిక మరో వార్త వ్రాస్తుంది. తీరా చూస్తే మీ పత్రికలవాళ్లే వరుడ్ని చూసి పెళ్ళి కూడా జరిపించేస్తారులా వుందే" అంది.

"అంతగా కోప్పడిపోతారెమిటండీ?" అన్నాడా రిపోర్టర్.

"మరి? మంచి బ్యానర్ వుండాలి. వాళ్లకు మంచి కథ దొరకాలి. అందులో నాకు మంచి కెరెక్టర్ ఉండాలి. అని నా అభిప్రాయం. అటువంటి అవకాశం కోసం కొంత కాలం వేచి చూడాలి కదా? అందుకని నాకు తెలుగులో ఒక్క సినిమా తప్ప మరే సినిమాలు లేవంటే ఎలా ? తక్కువ చిత్రాలలో చేసినా తప్పే, ఎక్కువ

## గౌతమి కోపం

చిత్రాలలో చేసినా తప్పే," అని గౌతమి గడగడా తిట్టేసి సెట్‌లోకి వెళ్ళిపోయింది. పాపం, ఆ రిపోర్టర్ బలంగా నిశ్వాస వదిలాడు.



ఇఫ్కో చైర్మన్ పెళ్ళకూరు రామచంద్రారెడ్డి గారి 73వ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని ఢిల్లీలోని లాక్ హౌసింగ్‌లో 5.3.95 తేది ఇఫ్కో డైరక్టర్ల బృందం మెమెంటో సమర్పిస్తున్న దృశ్యం

## మత విద్వేష మాలిన్యాన్ని మానవతా అమృతంతో క్షాళన చేసుకోమని సందేశం ఇస్తున్న మణిరత్నం మహోన్నత సృష్టి!

# బొంబాయి

అయోధ్యలో బాబ్రీ మసీదు కూల్చివేత తదనంతరం తలెత్తిన విషమ పరిస్థితుల నేపథ్యంలో తమిళ దర్శక నిర్మాత మణిరత్నం "బొంబాయి" చిత్రాన్ని రూపొందించాడు. బాబ్రీ మసీదు కూల్చివేత తర్వాత బొంబాయిలో మత కలహాలు రేగాయి. ఆ కలహాల కారణంగా బొంబాయిలో బాంబులు పేలాయి. గృహ దహనాలు జరిగాయి. కుత్తుకలు కోయబడ్డాయి. తల్లికోసం బిడ్డ విలపించింది. చని పోయిన బిడ్డల కోసం తల్లులు తల్లడిల్లి పోయారు. తప్పిపోయిన భర్తలకోసం భార్యలు తపించి పోయారు. సామాజిక జీవనం యుద్ధ క్షేత్రంగా మారిపోయింది. మనిషి రెండు కాళ్ళ నికృష్ట జంతువులా వీర విహారం చేస మిగిల్చిన, ఆక్రందన, ఆవేదన, బాధల గాయాలను; బొంబాయి నగరం తన గర్భంలో దాచుకున్న రక్తసిక్తమైన గుర్తుల్ని తన కథాంశాలుగా తీసుకొని ఒక కథగా మలుచుకొని తెర పై కనుపింప జేశాడు, మణిరత్నం. ఆనాటి ఘటనలు ఇంత భయంకరంగా జరిగాయా అని అందరూ ఆశ్చర్యపోయేంత వాస్తవంగా ఆ సంఘటనలు సృష్టించాడు బొంబాయిలోని ఘర్షణలే కాదు, భారతదేశం మతాల పేరిట ఎదుర్కొంటున్న కొన్ని ఇతర సమస్యలను గూడా చిత్రంలో చూపాడు.

మానవుణ్ణి మానవుడిగా బ్రతకమంటుంది ఈ చిత్రం. నరజాతి చరిత్రలో అతి భయంకరమైన, అతి బీభత్సకరమైన చెదు గుర్తులు సృష్టించే మత పిచ్చిని అలవరచుకో వద్దంటుంది. మనుషుల్లో మానవత్వం, నీతి నిజాయితీలు వుంటే ప్రతి మనిషి ఒక బుద్ధుడుగా, ఒక మహాత్ముడుగా, ఒక ఏసుక్రీస్తుగా వెలుగొందుతాడని ప్రబోధిస్తుంది. మత కలహాలతో తలమునక లైన ఈ చిత్రం చివరన మతసామరస్యం కోసం పాటు పడుతుంది. ఒక హిందువు కత్తికి ఒక ముస్లిం గురవుతున్నప్పుడు ప్రక్కన వున్న మరో హిందువు ముస్లింను రక్షిస్తాడు. అలాగే హిందువులను కూడా ముస్లింలు ఆదుకుంటారు. ఎన్నో యుద్ధాలలో రక్తంతో తడిసిన తన ఖడ్గాన్ని అశోక చక్రవర్తి కళింగ యుద్ధంలో కడిగినట్టు - చిత్రం చివరన ఎన్నో గుండెలను చీల్చిన బాకులను, కత్తులను ముస్లింలు హిందువులు క్రింద పడేస్తారు. ఎన్నో గృహాలను దహనం చేసిన కాగడాలను నీటిలో పడేసి చల్లారుస్తారు. మత పిచ్చి మలినంతో

**గిద్దలూరు గోపాలరావు**

కలుషితమైన హృదయాలను హిందువులు, ముస్లింలు, మానవతా అమృతంతో కడిగేసు కుంటారు. ఈ సన్నివేశాలన్నీ మణిరత్నం గొప్పగా చిత్రించాడు. అన్ని మతాలకు దేవుడొక్కడే. అన్ని మతాలకు చెందిన మనుషుల హృదయాలే ఆ దేవుడు వెలసిన ఆలయం అని బోధిస్తూ రకరకాల పువ్వులను, అనేక జాతుల పత్రిని కలిపి ఒకే పూజా ద్రవ్యంగా ఆ ఆలయంలోని దేవునికి అర్పించిన పూజారిగా నిలిచాడు మణిరత్నం.

మత ఘర్షణలు, మత సామరస్యాలను గట్టి పట్టుగా అందరినీ ఆకట్టుకునేట్టు చూపటమేగాక, అందరినీ అలరించే సున్నితమైన వినోదాన్ని కూడా అందించాడు. అన్నిటినీ మించి సాంకేతిక విలువల్ని గొప్పగా సమకూర్చాడు. విశాఖ జిల్లాలోని భీమునిపట్నంలోని ప్రకృతి దృశ్యాలను రాజీవ్‌మీనన్ తమ కెమెరాతో శోభాయ మానంగా చూపాడు. ఎ.ఆర్.రెహమాన్ సంగీతం ముఖ్యంగా నేపథ్య సంగీతం అద్భుతం.

మత ఘర్షణలకు తోడుగా ఒక ప్రేమ కథను కల్పించుకున్నాడు మణిరత్నం. భీముని పట్నంలో నివసిస్తున్న శేఖర్ అనే ఒక బ్రాహ్మణ యువకుడు షైరాభాను అనే ఒక ముస్లిం యువతిని ప్రేమిస్తాడు. వారి పెళ్ళికి మతం అడ్డు తగులుతుంది. ఇద్దరి తండ్రులు ఘర్షణ పడతారు. బొంబాయిలో పత్రికలో పనిచేస్తున్న శేఖర్ బొంబాయి వెళ్ళిపోతాడు. అతని పిలుపుమీద షైరాభాను ఇంట్లో చెప్పకుండా బొంబాయి వెళ్తుంది. శేఖర్, షైరాభానులు రిజిష్టర్ పెండ్లి చేసుకుంటారు. వారికి కవల బిడ్డలు పుట్టారు. ఒక బిడ్డకు హిందూపేరు, మరో బిడ్డకు ముస్లింపేరు పెట్టుకుంటారు. ఇంతలో బాబ్రీమసీదు కూల్చివేత జరగడం, బొంబాయిలో అల్లర్లు రేగడం జరుగుతాయి. శేఖర్ తండ్రి, షైరాభాను తల్లిదండ్రులు తమ బిడ్డల్ని చూచేందుకు బొంబాయి వస్తారు. వాళ్లు ఘర్షణల్లో జరిగిన గృహదహనంలో చనిపోతారు. ఆ అల్లకల్లోలంలో షైరాభాను, శేఖర్ తప్పి పోయిన తమ ఇద్దరు పిల్లల్ని వెతుక్కుంటారు. చివరన మత కలహాలు శాంతించడం, మత సామరస్యం నెలకొనడం, శేఖర్, షైరాభానులు తమ పిల్లల్ని కలుసుకోవడం జరుగుతుంది.

శేఖర్, షైరాభానుల ప్రేమ కలయికను జోరుగా కురిసే వర్షంలో చూపించాడు దర్శకుడు. ఆకాశం నుంచి జారే వర్షం భూమిని అభిషిక్తం చేస్తుంటే, ఆ ప్రేమికు లిద్దరూ వానలో తడుస్తూ ప్రేమారాధన జరుపుకుంటారు. రెండు మతాల కలయికకు పట్టాభిషేకం నెరపుతారు. పచ్చని చెట్లు, పల్లని కొండలు, ఆకాశం ఎత్తున ఎగిరే సముద్రపు అలలు ఆ ప్రేమికుల నుతాకి ఆశీర్వదిస్తాయి. ఈ దృశ్యాలు శోభాయ మానంగా వున్నాయి

ఏ కులస్థుడైనా భారతీయుడే. ప్రతి భారతీయుడూ భారతీయ సంస్కృతికి ప్రతీకగా, శాంతి స్వరూపుడుగా, మానవతా వాదిగా నిలచి భారతదేశం ఈ భూగోళం మీద సగర్వంగా తలెత్తుకుని నిలిచేటట్టు చేయాలన్న ఆశయానికి, ఆదర్శానికి మానవతా మార్గం సుగమం చేసింది ఈ చిత్రం. మణిరత్నం రూపొందించిన మరో ఆణిముత్యంగా ఈ చిత్రాన్ని చెప్పొచ్చు.



## సినిమా

11 పేజీ కొరవ

మాంగల్యమా?"; శ్రీ రవిచందర్ కంబైన్స్ "మృత్యుంజయుడు"; ధర్మసాయి ఫిలిమ్స్ "ముద్దుల చెల్లి"; ఉదయ్ క్రియేషన్స్ "మరణభేరి"; శరహో ఆర్ట్స్ "నిరంతరం"; లక్ష్మీశ్రీనివాస ఆర్ట్ క్రియేషన్స్ "పదకవిత పితామహ శ్రీ అన్నమాచార్య"; పృథ్వి ఫిలిమ్స్ ఇంటర్నేషనల్ "పెళ్లిముహూర్తం"; స్టార్ అండ్ స్టార్ క్రియేషన్స్ "రొమాన్స్"; శ్రీనివాస అసోసియేట్స్ "శ్రీ షిర్డిసాయి లీలలు"; సిరి ఫిలిమ్ ఇంటర్నేషనల్ "సీతక్క"; ఎస్.వి.ఎస్. మూవీస్ "సంభవామి యుగే యుగే"; మేఘమాల మూవీస్ "స్ట్రీట్ ఫైటర్"; జనశక్తి ఫిలిమ్స్ "విప్లవ వీరుడు"; ఎ.కె. క్రియేషన్స్ "యమహో యమహో!"; ప్రమీల ప్రొడక్షన్స్ "టెర్రరిస్ట్"; లక్ష్మీ గణపతి ఆర్ట్ ఫిలిమ్స్ "ఘరానాదొర"; వెంకటసాయి ఫిలిమ్స్ "ఘరానా కిల్లర్"; శ్రీ అఖిలాండేశ్వరి ఫిలిమ్స్ "రౌడీ యముడు"; నాగమణి ప్రొడక్షన్స్ "డ్రైవర్ రుద్రయ్య"; శ్రీ రామ్ క్రియేషన్స్ "కాలేజ్ హీరో"; సాయి కృపా ప్రొడక్షన్స్ "వనిత"; సాయి శ్రీ ఆర్ట్ ప్రొడక్షన్స్ "హీరో డాక్టర్"; సాయిలక్ష్మి సినీ ఎంటర్ ప్రైజెస్ "వగలాడి"; ;

### శ్రీదేవి భవనం ముందు మిథున్ కారు

అది వరకు ఎంతో సన్నిహితంగా వుండే శ్రీదేవి, మిథున్ చక్రవర్తి విడిపోయాక వారిద్దరి మధ్య మాటలు కూడా లేవు. ఇటీవల మద్రాసులో శ్రీదేవి భవనం ముందు మిథున్ కారు తరచు కనిపిస్తోంది. తన చిత్రాలను మద్రాసులో షూట్ చేయమని కూడా మిథున్ నిర్మాతకు సూచిస్తున్నాడట.

### నగ్మాకు ఆలయమా?

నగ్మా తమిళ తార రేఖతో అన్నదట. "నాకు ఆంధ్రలో ఒక చోట గుడి కట్టిస్తున్నారట తెలుసా? అని; మళ్లీ ఆమే ఏదో పత్రికలో చదివాను. ఇందులో ఎంత నిజముందో తెలుసుకోవాలి. ఈ వార్త తొలుత విన్న వెంటనే అదిరిపోయాను. గుడి కట్టించడానికి నేనేమి సాధించానని? ఏమిటో ఈ అభిమానం? అని లోలోపల ఉప్పొంగిపోతున్నా పైకి మొగమాటంగానే చెప్పింది "బొంబాయి తారలకు తరచు ఇటువంటి స్టంట్లు ఏదో ఒకటి వేయడం మామూలు. అందుకే వాళ్ళకోసం మన దర్శక నిర్మాతలు అంతగా ఎగబడరం" అని ఆ తర్వాత రేఖ, తనతో వున్న [illegible] నటి మనోరమతో ఈ విషయం చెప్పి నవ్వుకున్నది.

## గ్రంథసమీక్ష

4 పేజీ కొరవ

కావ్యం మృత్యువులో రగిలి పెరిగిన చైతన్యంగా రూపొందింది.

మృత్యువు తాకిడిని ఎలా చెప్పాడంటే "మనసు మరీ మరీ చెబుతోంది ఈ చేను చీడ పారుతోందని, ఈ చెరువుకు గండిపడుతోందని" చావును గురించి ఆలోచించ వద్దంటూ "ఉదయ రాగంలో రాత్రి ఊహలెందుకు" అంటాడు "కొన్ని నక్షత్రాలు పుడుతున్నాయి పాతవి చస్తుంటే, పొడి గట్టి ముసలి తనం ఊరు వదిలితే పసి తనం ఊయలూగుతోంది" అంటూ మృత్యువు స్వభావాన్ని విశద పరిచాడు.

మరణమంటే అందరికీ భయమే. మరణాన్ని దృఢ చిత్తంతో ఎదిరించి, జయించి నిలిస్తే ముందు జీవితం విరగబూచిన పూలతోటే అవుతుందంటాడు. ముఖ్యంగా రోగ పీడితులను వెన్ను తట్టి బ్రతుకు బాట వైపుకు సుఖంగా నడిపించే ముఖ్య ప్రయత్నమే ఈ గేయ కావ్యం. సరళమైన, సజీవమైన సహేతుకమైన భాషతో, భావాలతో నిండి వుంది ఈ కావ్యం. మృత్యు ముఖంలో చిక్కుకొని వున్నా, ఆరోగ్యం పూర్తిగా అనుమతించక పోయినా, బాబూరావులో సాహితీ పిపాస సన్నగిల్ల లేదని, ఆయన ఆలోచనల్లో భావావేశం చల్లారలేదని, ఆయన చూపుల్లో పరిశీలనా దృష్టి మందగించ లేదని ఈ గేయ కావ్యం రుజువు చేస్తుంది. గేయ కవిగా తన కంటూ ఒక ముద్ర ఏర్పరచుకొని, మేటి కవులైన డా. సి. నారాయణ రెడ్డి డా. బూదరాజు రాధాకృష్ణ శ్రీ బాగభైరవ కోటేశ్వర రావు శ్రీ అల్లు వెంకట అప్పారావుల చేత ఆమోద ముద్ర వేయించుకున్న బాబూరావుకు ఇక ప్రత్యేక ప్రశంసలెందుకు?

## నెల్లూరు సంగతులు

4 పేజీ తరువాయి

కానిస్టేబుళ్లు, 100 మంది హోంగార్డులు, తమిళ నాడు పోలీసులు వుంటారు. పౌరులు తమ ఓటు హక్కును స్వేచ్ఛగా వినియోగించు కోవచ్చుని, ఏదైనా ఇబ్బంది ఎదురైతే 100, 28400 నంబర్లకు ఫోన్ చేస్తే వెంటనే వచ్చి ఆదుకొంటారట. ఏమైనా ఈ పోలీస్ చర్యలు బహుశా అధికార పార్టీకి అనుకూల ఏర్పాట్లు కాదు కదా?

### న్యాయమూర్తి చెప్పిన నిజం!

జిల్లా జడ్జి ఎల్. అప్పారావు గారు కష్ట జీవి; కష్టపడి చదివి క్రింది స్థాయి వుద్యోగాల నుండి జడ్జి స్థాయి వరకు ఎదిగారు. కృషి, పట్టుదల విద్యార్థినులకు ఎక్కువగా వుండాలని ఆయన డి.కె. డబ్ల్యు కళాశాల 30వ వార్షికోత్సవానికి ముఖ్య అతిథిగా హాజరై సందేశమిచ్చారు. మహిళలు తలచుకొంటే సాధించలేనిది ఏదీ వుండదన్నారాయన. కోర్టుకు కళ్లు లేవు; చెవులున్నాయనే సామెత అక్షర సత్యమని తన స్వీయ అనుభవాన్ని వివరించి ఆశ్చర్య పరిచారు. ఆయన తెనాలి మెజిస్ట్రేట్‌గా వున్నప్పుడు ప్రతి దినం వాకింగ్‌కు వెళ్లే వారట. ఒక రోజు ఒక రిక్షా కార్మికుడు మద్యం తాగి భార్యను నడి రోడ్డు పైన 30 కత్తి పోట్లు పొడిచాడట. ఆ సంఘటన తన కళ్ల ముందే జరిగిందని, ఆస్పత్రిలో చేర్పించగా ఆమె బ్రతికిందని, చివరకు ఆ కేసు తన కోర్టుకే వచ్చిందని చెప్పారు. దాదాపు 30 మంది సాక్షులు రిక్షా కార్మికుడు తన భార్యను పొడిచినట్లు సాక్ష్యం చెప్పారని, కాని చివరకు కత్తి పోట్లకు గురైన ఆ కార్మికుడి భార్యే తన భర్త తనను పొడవ లేదని చెప్పడంతో ప్రత్యక్ష సాక్షి అయిన తానే ఆ కేసును కొట్టి వేసినట్లు చెప్పారాయన. ఇటీవల మనుబోలు గ్రామస్థులు 18 మందికి యావజ్జీవ శిక్ష వేసే ముందు రోజు రాత్రి తాను మానసిక వ్యథతో నలిగి పోయినట్లు చెప్పారాయన.

పరీక్షల్లో ప్రతిభ కనపర్చిన విద్యార్థినులకు జడ్జి సతీమణి శ్రీమతి ఇందుమతి బహుమతులు ప్రదానం చేశారు. కాలేజి ప్రిన్సిపల్ శ్రీమతి సీతాదేవి వార్షిక నివేదిక, విద్యార్థి సంఘ నాయకురాలు బిందుమాధవి స్టూడెంట్స్ యూనియన్ నివేదిక చదివారు. తరువాత జరిగిన సాంస్కృతిక కార్యక్రమాలు పలువుర్ని ఆకట్టుకొన్నాయి.

### వివేకానంద జయంతి సభ

పీడిత జనసేవకు తన జీవితాన్ని వినియోగించిన యతివరేణ్యుడు స్వామి వివేకానందుడి జయంతి సభను నెల్లూరు వర్ధమాన సమాజం 12 తేదీ టౌన్‌హాల్‌లో నిర్వహించింది. రిటైర్డ్ జిల్లా కలెక్టర్ టి. మునిరత్నం సభను అధ్యక్షించారు. వి.ఆర్. కళాశాల రిటైర్డ్ లెక్చరర్ వి.ఎస్. రామచంద్ర రావు ప్రధాన వక్తగా విచ్చేసి స్వామి వివేకానంద అద్భుత వ్యక్తిత్వాన్ని ఈనాటి సామాజిక పరిస్థితుల్లో వివేకానందుని ప్రబోధాల ఉపయుక్తత గూర్చి వివరించారు. వివేకానందుని ప్రబోధాల్లో ప్రధానమైన సర్వమత సమభావం, త్యాగపూరిత సేవ, స్త్రీజనోద్ధరణ, విద్యా వ్యాప్తి, అస్పృశ్యతా నివారణ, ఆధ్యాత్మిక వికాసం నిత్య నూతనం. ఆధ్యాత్మిక, నైతిక విలువలు త్వరితంగా అంతరించి పోతున్న నేటి సమాజానికి అవి అత్యంతా వశ్యకమన్నారు. ఆ మహనీయుని బోధనల ననుసరించి ప్రతి వ్యక్తి ఆత్మ పరిశీలన చేసుకొని తమ పరిధిలో శక్తి వంచన లేకుండా ఆచరణలో పెట్టి, ఆత్మ విశ్వాసాన్ని పెంచుకొని వ్యక్తిగత శీలాన్ని, ఆత్మ వికాసాన్ని పెంచుకొని సమాజ శ్రేయస్సుకై పాటు పడాలన్నారు. సభా పోషకులు మద్దాలి మల్లికార్జున రావు, మునిరత్నం, రామచంద్రరావులను దుశ్శాలువాలతో సన్మానించారు. తన కుమార్తె స్వర్గీయ డాక్టర్ రాజ్యలక్ష్మి స్మృత్యంకంగా పలువురు వికలాంగులైన పాఠశాల విద్యార్థినీ, విద్యార్థులకు నూతన వస్త్రాలు అందజేశారు. సమాజం కార్యదర్శి బి.వి. నరసింహులు వివరణ వందనాలు చెప్పారు.

### గీతా సందేశం గ్రంథావిష్కరణ

గీతా సందేశం పేరుతో ఆంగ్లంలో నూజివీడు వాస్తవ్యులు వైద్యుల నారాయణ దాసు రచించిన గ్రంథాన్ని 11 తేదీ సర్వోదయ కాన్వెంట్ భవనంలో దుగ్గిరాల వెంకట రమణయ్య ఆవిష్కరించారు. అధ్యక్షత వహించిన రిటైర్డ్ జిల్లా జడ్జి కెపి నారాయణ రావు మాట్లాడుతూ ప్రతి ఒక్కరూ చదవ గలిగే సులభ శైలిలో రచయిత రచన సాగించినట్లు చెప్పారు. పాశ్చాత్యులు గీతలోని గొప్పతనాన్ని అర్థం చేసుకొనేందుకు ఆంగ్లంలో రచించినట్లు రచయిత నారాయణ దాసు చెప్పారు. కళాసుధ అధ్యక్షురాలు శైలజా రెడ్డి స్వాగతం చెప్పగా, కార్యదర్శి వైద్యుల శ్రీనివాస రావు రచయితను సభకు పరిచయం చేశారు. రొటేరియన్ వెమ్మిన సుబ్రహ్మణ్యం రచయితను సన్మానించారు.

## జనవాణి

3 పేజీ

ఇంటిపేర్లు తండ్రి పేరుల మార్పులతోపాటు కొందరి పేర్లు అసలు జాబితాలోనే లేవు. కొందరిపేర్లు కొత్తగా నమోదు చేసుకొన్నారు కాని అనుబంధ జాబితాలో ఆ పేర్లులేవు. మధ్యాహ్నం పూట వెళితే ఒకరి ఓటు మరొకరు వేసేసి వున్నారు. ప్రతి ఎన్నికల్లో ఇవేక తవకలు జరుగుతూనే వున్నాయి. ఓటర్లకు గుర్తింపు కార్డులు ఇచ్చేపనిని ప్రభుత్వం ఇకనైనా చేపట్టాలని మనవి.

సంగం. -పొట్లశ్రీహరి.

### కరెంటుకోత- రైతులపాట్లు!

గ్రామీణ ప్రాంతాల్లో కరెంటు కోత అధికారికంగా ఆరుగంటలు. కాని అనధికారికంగా గంటల తరబడి కోత విధిస్తున్నారు. కోత నుండి మినహాయింపు వున్న కొద్ది గంటల్లో కూడా కరెంట్ సక్రమంగా సరఫరా చేయడంలేదు. పది నిమిషాలకో సారి వస్తూ పోతూ రైతులను ఇబ్బందుల పాలు చేస్తున్నది. లో వోల్టేజి వల్ల మోటార్లు కాలిపోతే, ఇళ్లలోని బల్బులు మాడిపోతున్నాయి. నీటి సరఫరా లేక పంటకొచ్చిన పైర్లు ఎండిపోతున్నాయి. ఈ సంవత్సరంలో రైతులు ఇప్పటికే పలు ప్రకృతి వైపరీత్యాలు ఎదుర్కొని డీలా పడిపోయి వున్నారు. విద్యుత్ సరఫరాలో గ్రామీణులపై, ముఖ్యంగా రైతాంగం పై ప్రభుత్వానికి ఎందుకింత వివక్షో అర్థం కావటంలేదు.

టి.పి. గూడూరు. -సి వెంకారెడ్డి.

### గ్యాస్ బుకింగ్‌లో ఇక్కట్లు!

మాకు ఇదివరలో బాలాజీ గ్యాస్ కంపెనీ ద్వారా గ్యాస్ జరుగుతుండేది. ఆ కంపెని తవకలకు పాల్పడు తున్నదని ప్ర... వారు స్వాధీం చేసుకొన్నారు. ప్రభుత్వం స్వీకరించడం వల్ల జరుగు తుందని ... వినియోగదారులకు కష్టాలు వచ్చాయి. మాకుండే రెండు సిలిండర్లను ఒకదాని తరువాత బుక్ చేయడం జరుగుతుండేది. 21 తేది సివిల్ సప్లయిస్ ఆఫీసు... గ్యాస్ బుక్ చేశాను. సీరియల్ ... ఇచ్చి 15 రోజులకు వస్తుంద... 15 రోజులకు అది రాలేదు. ఆ... ఫోన్ చేస్తే ఫోన్ ఎత్తరు. వుద్యో... దీనివల్ల పడరాని పాట్లు పడుతు... ప్రైవేట్ కంపెనీవారు రెండు, ... రోజులకే పంపుతుండే వారు. ప్ర... వారు స్వాధీనం చేసుకొన్నది ప్ర... ఇబ్బంది పెట్టేందుకా? సివిల్ స... మేనేజర్ ఈ విషయంలో చొరవ చు... వినియోగదార్లను ఆదుకోవాలని వ...

నెల్లూరు. -జి. హనుమాన్...

### అవినీతి పరులకు మంచి అవకాశం!

బొంబాయిలో ఏప్రెల్ న... యూని వర్సల్ బ్యాంక్ ఆఫ్ స్విట్జ... నెలకొల్పు తున్నారు. రాజ... నాయకుల వద్ద నున్న ప్రజా ధ... ఇకనుండి బొంబాయిలోనే ... పెట్టుకొని ఎలక్షన్ల సమయంలో ... పెట్టుకోవచ్చు. పాపం మన నాయ... మాటి మాటికి స్విట్జర్లాండ్ ... నెంబర్లు చెప్పి తెచ్చుకోవలసిన పని... దర్జాగా . ఇక్కడ దాచుకోవ... ఆదాయపు పన్నువారి బాధ వుండ...

నెల్లూరు. గునుపాటి వేణుగోప...

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Niyagara Paper Products (India) Ltd